# కృతి సమర్పణ



ఏ మహనీయుల పాదారవిందములకు నా మేని చర్మమును
దీసి పాదరక్షలుగా చేసి యిచ్చినను ఋణమును
దీర్చుకోజాలనో, అట్టి మదీయ మాతృ
పితృ దేవులగు లక్ష్మమాంబ,
నారపాఖ్యులకీ కృతిని
సమర్పించితిని.





సురభి నాట్యకళా స్థాపనాచార్య హరికథా ప్రవీణ

రాప్తాటి సుబ్బదాసు.

# పీఠిక.



పూర్వము రసికశ్రేష్ఠులగు విమర్శకులు "నాటకాంతం సాహిత్యం" "నాటకాంతం కవిత్వ" మని సెలవిచ్చిరి. ఈ రెండు వాక్యములవలనఁ గవిత్వముయొక్క పరమావధి నాటకమే యని యును, నాటకమునందే కవితాకళ సంపూర్ణత నందుననియు, స్ఫురించు చున్నది. నేఁడును రసలుబ్ధమగు సహృదయలోకమీ యభిప్రాయ మును సగౌరవముగ నంగీకరించుచున్నది.

నాఁటినుండి నేఁటివఱకింత యమూల్య గౌరవము నందిన నాటకమునకుఁ బీఠిక వ్రాయుటకు నసాధారణ ప్రజ్ఞాధురీణుఁడగు సహృదయుఁడే కావలయును. విషయ మిట్లుండ, నసంస్కృత హృద యుఁడనగు నేను పీఠిక వ్రాయఁబూనుట సాహసమే యనక తీరదు. కాని, సుబ్బదాస యోగిగారికి నాపైఁగల యఖండాభిమానమును వారితో నాకుఁగల మిత్రత్వమును నన్నీ పనికిఁ దప్పనిసరిగాఁ బురికొల్పినవి. పండితలోకము నా సాహసమును మన్నించుఁ గాక!

జయదేవుని చరిత్రము శ్రీ మహాభక్త విజయమునందు వర్ణింపఁబడినది. జయదేవుఁడు సంస్కృతమున ప్రసన్న రాఘవ మను నాటకమును రచించిన కవిశేఖరుఁడును గీత గోవిందమను కృష్ణస్తుతి నష్టపదులుగా వ్రాసి భక్త భగవన్మానసముల నోక్కొక్క పరిఁ జూఱఁగొన్నవారియం దద్వితీయుఁడును నై యున్నాఁడు.

ఇతని చరిత్రమున నాధునిక లోకమున కసంభవములనియు, నసత్యములనియుఁ దోఁచు నద్భుత విషయము లనేకములు పొడఁ గట్టుచుండును.

జననమందినది మొదలు కృష్ణపాదాంబుజ ద్వంద్వ సేవా నిరతుఁడై, రసికాగ్రేసరుఁడై, విద్వచ్ఛిఖామణియై విరాజిల్లిన మహా నీయుఁడు.

సహృదయుఁడు గాక రసికుఁడు గాఁజాలఁడు. రసికుఁడుగాక కవి కాఁజాలఁడు. కవియు భక్తుఁడును ఒక్క తెగకుఁ జేరినవారు.

భక్తిలేని కవిత్వమునందు కళ సంపూర్ణత నొందఁజాలదు. కవిత్వము లేని భక్తికి సంపూర్ణత లేదని నే ననను గాని, భక్తికిఁ గవిత్వ మొక్కింత దోహదము కాఁగలదని మాత్రము చెప్పఁగలను. భక్తుఁడు కవి యయ్యెనేని, యాతఁడు స్థిరజీవియు, జగద్వంద్యుఁడును కాఁగలఁడు. అట్టి భక్తుఁడెట్టి దుర్ఘట కార్యములేనిఁ జేయఁగలఁడు. ఆతని చేతిలోఁ పిడుగు పూఁబంతి యగును. విష మమృత మగును. ఆతనికి సాధింపరాని కార్యము లేదు. ఆతని కజేయుఁడు లేఁడు. మన జయదేవుఁడీ తెగలోఁ జేరిన మహానీయుఁడగుట, దుర్ఘటములును పరమాద్భుతములు నైన కార్యములు చేయఁ గలిగినాఁడు. మన మనస్సట్టి పరిపక్వ దశలోని కింకను రాకుండుటం జేసి, మన మతని చర్యలను సంపూర్ణముగ నమ్మఁజాలకున్నాము. అంతటితో విరమింపక హేతువాదముల కుపక్రమించుచున్నాము. కాని, యియ్యది మన విమర్శనా లోపముచేతనే యని నా నమ్మకము. పై కారణములఁ బట్టి జయదేవుని చరిత్రములోఁ గనుపట్టు పరమాద్భుత చరిత్రము లన్నియు నమ్మఁదగిన వనియే నా మతము.

ఇట్టి శ్రీజయదేవుని చరిత్రమును, నది కావ్యమో, నాటకమో, ఖండ కావ్యమో చెప్పలేను గాని, పద్యరూపమగు పొత్తముగా తెల్లావఝ్ఝుల శివశంకర శాస్త్రిగారు రచించిరి కాని, యందలి యితివృత్త మసమగ్రమును, నసమంజసమునై యున్నది. కారణము-వారు జయదేవుని కేవల శృంగార ప్రియునిగాఁ దలంచి యాతని భక్తికి, సాధువర్తనమునకు నేమాత్రము చోటియ్యక "పద్మావతీ చరణచారణ చక్రవర్తిని" చేసినారు. పై పెచ్చు ఆననాబ్జ కరాబ్జ పాదాబ్జములకు భేదము లేదని పద్మావతికి జయదేవునితోఁ జెప్పించినారు. ఎంత శృంగార లోలుఁడైనను జయదేవుని వంటి మహానీయుఁ డసభ్యము లగు నిట్టి మాటలాడునా? యను సందియముగూడ వారికిఁ బొడగట్టలేదు కాఁబోలును. కేవలము కావ్య మీమాంసకే వారా పొత్తము రచియించియుండినను, జయదేవుని నింత యసభ్యముగాఁ బోషించుట సాహసముగుఁగాక. ప్రస్తుతమునకు వత్తము.

మన సుబ్బదాసుగారి నాటకమునందు జయదేవుఁడు కేవలము

జ్ఞానసంపన్నుఁడు. మోక్షాసక్తి గలవాఁడు. ఇంతియకాక పరోపకార పారీణుఁడు. శత్రువులకేని కీడు దలంచువాఁడు కాఁడు. అంతశ్చక్షువు గలవాఁడు. అపర బుద్ధావతారము. నిష్కామసిద్ధి నందినాఁడు. సర్వ జగత్పాలకుఁడగు శ్రీకృష్ణ భగవానుఁడు ప్రత్యక్షమై వరము గోరుకొను మన్నప్పుడు, తనకుఁ బోయిన కాలుసేతులిమ్మని కోరక యుంట యట్లుండఁ, దన కాలుసేతులు ఖండించి ఘోరాపకార మొనర్చిన దొంగలకు సారూప్యమిమ్మని వేఁడుకొన్న మహాను భావుఁడు. సర్వ జగన్నియామకుఁడు, సర్వవ్యాపియునగు శ్రీకృష్ణుని సతతము తన హృదయాధివాసునిగాఁ జేసికొనఁగలిగిన ధీరుఁడు. జగన్మోహన స్వచ్ఛవాక్కులచే రాజాధిరాజులను, వశము చేసి కొన్న మాంత్రికుఁడు. సర్వకాల సర్వావస్థల యందును వేదాంత ప్రశంసయే పనిగాఁ గలవాఁడు. అట్టివాఁడయ్యు భార్యమానసము త్రుటిలోఁ జూఱగొన్న రసికాగ్రేసరుఁడు. ఇట్టి పవిత్రచరిత్రుఁ డగు జయదేవుని మనకుఁ జిత్రించియిచ్చిన కవిగా రాంధ్రలోకమున కభివందనీయులు.

ఇఁక నిందలి పద్మావతి, పతిచరణ సేవాపరాయణయై పతిని దైవముగాఁ దలంచి పూజించు పూతచరిత. అనవరత పతిచరణ ధ్యాన పరాయణయైయుండు మానసీయ. ఇంతియకాక, పతి ప్రాణము పోయినంత సతి ప్రాణమేల పోకుండునని తలంచిన సాధ్వి. తలంచుటయేకాక, పతి వ్యాఘ్రనిహతుఁడయ్యె నని విన్నక్షణమే, మేనువాసిన జగద్వంద్య. ఇట్టి యమూల్యపాత్ర వేఱొక్కటి యుండదు.

ఇట్లు కథానాయకుఁడును, నాయకియుఁ, బవిత్రులై యుం డుట యుత్తమ నాటకలక్షణము. కాన నీ నాటకము ప్రశంసా పాత్రమైనది.

సంస్కృత నాటకములందు రంగములు లేవు. కాని యాంగ్ల పద్ధతి ననుసరించి యాధునికులగు నాంధ్ర కవులు నాటకముల యందు రంగములం జొన్పించిరి. ఇది సమంజసమా-కాదా? యను ప్రశ్న కిచ్చటఁ దావులేదు. తమకంటె ముందు వా రేత్రోవఁ ద్రొక్కిరో మన దాసకవిగారును నాత్రోవయే త్రొక్కిరి. కాన,

వారుగాని నేనుగాని యిద్దాని గుఱించిన నిందాస్తుతులకు బాధ్యులము కాము.

రెండవది సంగీతవిషయ మగు చర్చ. నాటకములందు సంగీత ముండవచ్చునా కూడదా యనునది. ఈ విషయమునఁ గొందఱాధునికులు సంగీతము కూడదనుచున్నారు. అది వాస్తవమే. ఐనను బొత్తిగా నుండఁగూడదనుట సాహసము. లలితకళ లొండొంటికన్యోన్యము సాహాయ్యము కావలసియుండును. కవిత్వము లేని సంగీతము రాణించునా? సంగీతములేని కవిత్వము రాణించునా? పై రెండును స్వతంత్రకళలయ్యును, మిళితము కానిదే రక్తికట్టఁగు. అట్లే కవిత్వ సంగీత శిల్పకళలతోఁ జేరి పండిత పామర వివక్ష లేక యానందాబ్ధి నోలలాడించునది నాటకకళ. కాన, సంగీత మించుక గలుపవచ్చును గాని, ఎక్కువగా నుండఁగూడ దనువారి మాట నిక్కువము. కాన కవిగారు కొంత పూర్వులఫక్కి ననుసరించి అనేక వృత్తరూపముల సమయోచితముగ సంగీతకీర్తిఁ బాడుటకు మార్గమును జూపించినారు.

ప్రేక్షకులకు విసుగు పుట్టింపకుండునట్లు రచించుట కవిగారు సాధ్యమైనంత దనుక నిర్వర్తింపఁ గలిగిరి. రచనావిధానము, పాత్రల సంభాషణమును, మనోజ్ఞము. ఇట్లన్ని విధముల స్తుత్యమై లలిత శైలిలో రచింపఁబడిన యీ నాటకరాజ మాంధ్రభాషా రమణి కొక యమూల్య భూషణమై విరాజిల్లఁగలదు.

ఇప్పటికే పీఠిక విస్తారమై యుండుట వలన, నాకీ నాటకమునకు పీఠిక వ్రాయు లాభము చేకూర్చిన శ్రీ సుబ్బదాస కవిగారికి కృతజ్ఞతఁ దెలుపుచు నింతటితో విరమించుచున్నాను.

"ఆపరితోష ద్విదుషాం నసాధుమన్యే ప్రయోగ విజ్ఞానం"

ఇట్లు,
సహృదయ విధేయుఁడు,
అల్లసాని రామనాథ శర్మ,
అష్టావధాని.

కేశవపురము
16—11—1936



# తొలి పలుకు



ఈ దృశ్య కావ్యము, సురభికంపెనీ వారి ఖేలనము నుద్దేశించి, ముప్పది యేండ్ల క్రితము రచింపఁబడినది. కారణాంతరమున వారికిఁ జెందలేదు. నా జన్మభూమియగు ధర్మవరమున "వాణీ మనో వినోదిని" యను నాటకసభను స్థాపించి, తత్సభామూలమున నా మిత్రుఁడగు ఆర్. వెంకటేశమయ్యగారి ప్రేరణమున దీనిని బ్రదర్శించితిని. జయదేవ భూమికను నేనే ధరించి - యభినయించి, ప్రజల పొగడ్తకుఁ బాత్రుఁడ నైతిని.

తరువాత నాటకములయందలి యభిలాష నాకుఁ గ్రమముగా దిగజాఱెను. ఇహపర సాధనములకు మూలమగు హరికథా కాలక్షేపమున నాంధ్ర దేశమునందంతటను నేను సంచారము గావించితిని. దేశమందంతటను కథలుచేయుచు, గడించిన విత్తము వినియోగించుచు, ధర్మవరమున హఠయోగాశ్రమమును స్థాపించు తీవ్రేచ్ఛలో నుండుటచేత, నింతదనుక నాంధ్ర ప్రపంచమున కీ నాటకమును సమర్పింపఁ జాలనైతిని. నాచే నెలకొల్పఁ బడిన హఠయోగాశ్రమాభివృద్ధికై, పండ్రెండేండ్లుగా రేయింబవళ్లు నెడతెగని దీక్షతోఁ బరిశ్రమించుచు, నిరంతరము నతిథిపూజఁ గావించుచు వర్తించుచుండు, గురుపూజా పరాయణ—మామక శిష్యురాలు శ్రీమతి బొజ్జమ్మ వేఁడికోలువలనను, పట్టుదల వలనను నీ నాటక ప్రచురణప్రయత్నము సాగివచ్చినది. దీని నుద్దేశించియే "నిగమార్థ చంద్రోదయ" మను * గ్రంథమాలను స్థాపించితిని. ప్రజలనుండి ధనము గడించి నేటి కిద్దానిఁ బ్రకాశపఱచితిని.

ఈ నాటకరచనకు (శ్రీ) మహాభక్త విజయమందలి కథ మూలముగాఁ గొంటిని. కథానాయకుఁడగు జయదేవుఁడు,

---

* గ్రంథమాలకు రాజపోషకులు నభిమానులు సహాయకులునై నన్నుఁ బ్రోత్సహించినవారికి సంవత్సరమునకు మూఁడు గ్రంథముల వంతునఁ బ్రచురించునట్లు చెప్పియుంటిని. ప్రకృత యుద్ధ పరిస్థితులచే కాగితముల ధరలు హెచ్చుటవలన, నేఁడాదికి రెండేసి పుస్తకములే ప్రచురింతునని, ధనదాతలకు విన్నవించెదను. రాఁబోవు గ్రంథము "పురాణకథా విమర్శనము"

ప్రవాసము వెడలిపోయి మరలకుండుటచే, నాతని సహధర్మిణి పద్మావతీదేవి - యేడుఁగాలము నిరీక్షించి, పతివియోగము సైఁప లేక, యగ్నిప్రవేశముచేయ నిశ్చయించుకొనెను. జయదేవుఁ డొక తాళపత్రముపై 'కల్యాణీ'యని వ్రాసిపంపెను. అగ్నిప్రవేశము చేయ నుండిన పద్మావతీదేవి, ప్రాణప్రదమగు నా పదముఁ దిలకించుటవలన భర్త జీవించియున్నట్లు గుర్తించి, యసువులు నిల్పుకొనెను. కావున నిద్దానికి "అభిజ్ఞాన జయదేవ" యను పేరిడఁబడినది. అనుదినము నూతన గేయములు మెండుగ వెలువడుచుండుటచేత, నాటక మందలి పాటలఁ దొలఁగించి, జాతి వృత్తములను బెక్కింటిని జొన్పితిని.

కవిసార్వభౌము లెందఱో నాటకరాజములను వెలయించి కీర్తి గడించుచుండిన యీ కాలమున, నేనీ కావ్యముఁ బ్రచురించుటకుఁ గల ముఖ్యకారణము, ఏతద్దృశ్యకావ్యమూలమున మహాత్ముని .యహింసా సత్యముల రుచిని ప్రజలకుఁ జూపి, వారిలో దేశభక్తిని పురికొల్పవలయు ననుటయే! అహింసా సత్యవ్రతములకు నాకర మనందగిన పురుషుఁడు జయదేవుఁడు. అమ్మహనీయుని జీవిత చరిత్రమున కాదర్శమువంటి యీ నాటక మీ నాఁటికి నాంధ్ర లోకమున కర్పింపఁ జాలినందులకు మిగుల సంతసించుచున్నాను.

దీని ముద్రణమునకు వలయు ధనము సేకరించుటలోను, గ్రంథమాలకు చందాదారులఁ జేకూర్చుటలోను, జేదోడు వాదోడుగా నాకుఁ సాయపడిన నా మిత్రరత్నమగు శ్రీయుత కలవల చిన్నారాయణప్ప శ్రేష్ఠిని, భగవానుఁడు భావుకముల నొసంగి మనుచుఁగాక!

ఆదరపూర్వకముగ నీ నాటకమునకుఁ బీఠిక వ్రాసి యొసఁగిన యష్టావధాని, బ్రహ్మశ్రీ యల్లసాని శర్మగారికిని, కాల విలంబము లేక దీనిఁ జక్కఁగ ముద్రించి యిచ్చిన యనంతపుర లక్ష్మీ స్వదేశీ ముద్రాధిపులకును గృతజ్ఞుఁడను.

ధర్మవరము,
**20—11—1941**

రాప్తాటి సుబ్బదాసు,
గ్రంథకర్త.

# పండితాభిప్రాయములు.



1

అభినవ బాణకవి, ఆశుకవిచక్రవర్తి,

శ్రీ గౌరావఝ్ఝుల రామకృష్ణ శాస్త్రి, శతావధాని, అనంతవరము.

గజ్జలకొండ పోస్టు 23—3—1932

కం॥ నానా రసాన్వితము మేధానిధి! రాప్తాటి సుబ్బదాస కవీ! సు
జ్ఞాన జయదేవ నాటక। మానందంబొసఁగె వినినవాడికి మదికిన్

మ॥ అమృతం బొలుకుచునుండ నెయ్యెడల శయ్యాపాక రీత్యౌచితీ
క్రమవృత్తిచ్ఛట లింపు నింప సుకవీంద్ర శ్రేణి శ్లాఘింప న
చ్చము నీకన్న నిరర్గళాంధ్ర కవితా సామ్రాజ్య పట్టాభిషే
కము నందగ్గలవాఁ డెవం డవని నో, కవ్యగ్రణీ! చూడఁగన్

చం॥ ఇరువది కించుమించు రచియించితి వాంధ్రమునందు మాధురీ
గరిమ జెలంగ నాటక నికాయము లందు శిరోవిభూషణా
దర పదవిన్ గడించినది తప్పక నీ జయదేవభక్త స
చ్చరితము దిక్తటంబుల యశంబు గడించెను నోబుధాగ్రణీ!

సీ॥ పద్మావతీ మృదు వాగ్విలాసముగన్న
భవదీయ శృంగార పాటవంబు
జయదేవు వేదాంత శాస్త్ర బోధనుగన్న
భవదీయ వైరాగ్య పాటవంబు
ధనదుగుప్తుని భక్తి వినయంబులను గన్న
భవదీయ గురుభక్తి పాటవంబు
దొంగ రోగుల దుష్ప్రసంగ సంగతిఁగన్న
భవదీయ జాతీయ పాటవంబు

తే॥ గీ॥ గానగావచ్చు దండివిజ్ఞానమహిమ
గన్యఁ దెలిపెడు నీకృతి కన్య నీదు
పాండితీ వైభవంబు నేర్పఱచె ననఘ
సుబ్బదాస కవీశ, యశోవిలాస!

కం॥ సంతానమనఁగ శోకా
క్రాంతంబని వీడి ముక్తి కాంతామణితో,
సంతోషమంది సత్కృతి,
సంతానము గాంచితివి ప్రశంసను నెక్కన్

2

శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు కడప.

ఇది ఐదంకముల నాటకము. గీతగోవిందమును, ప్రసన్న రాఘవ నాటకమును, రచియించిన మహాకవియగు జయదేవుని చరిత్ర మిందు మిగుల యింపుగ భక్తి జ్ఞాన వైరాగ్య రీతులతో, బొందుపఱచఁబడినవి. నాటక సంవిధానమును, పూర్వకవుల ననుకరించి వ్రాయబడినది. అంకవిభజనము, గోవాలాకృతిగా నమర్చబడినది. తుదుము మొదలు దేవతాగ్చన వఱకు నొక్కటే పాటగా యుండక, యిందున పాత్రోచితభావను సొంపుగా బొందుపఱచి, నాటక మలరుచున్నది. రచించిన కవియో—దాసశబ్దధారి, హరికథా ప్రవీణ బిరుదాంకితుఁడు. ఇంక కొఱవ ఏమిటి? ప్రతి పద్యమున, భక్తి తొలుకాడుచున్న దనుట అతిశయోక్తి కాజాలదు. భాషాభిమాను లీ నాటకమును చక్కగా చదివి, యానందాంబుధిం దేలుదురని నా నిశ్చితాభిప్రాయము.

---

3

కవిరత్నము, శ్రీ చెమికెల చన్నారెడ్డిగారు, పర్లపాడు.

బ్రహ్మజ్ఞాన నిధీ! రాష్ట్రాటి సుబ్బదాస యోగీ! తాము గద్వాల సంస్థాన కవిబ్రహ్మల సభలో గలసి నిర్మలజ్ఞాన వచోవిశాలత నొప్పుచున్న సమయమున, మీ వాఙ్మాధుర్యమును విని, మిము గుర్తించి నే నత్యానంద కందళిత హృదయార విందుఁడనైతి. మీరు దయతో నాచేతి కిచ్చి మీ రొనర్చిన ఐదంకముల "యభిజ్ఞాన జయదేవ" యను నాటకమును, కవులయెదుట సంగీత నైపుణ్యముచే రాజాస్థానమున జదివి నా యభిప్రాయ మిమ్మని యడిగినందులకు కృతజ్ఞత. ఈ గ్రంథ రాజము పరమార్థ బోధకము. నాటకలక్షణ లక్షితము. మృదుమధుర వచన రచనా విశేషమును, శాంత కరుణా రస ప్రధానమునునై, సాయంకాలోత్ఫుల్ల మల్లికా సౌరభమై, యవతరంగిణీ లహరీవిహారమ్మందవాయు శీతలంబునునై నా హృదయమున కత్యంత హర్షంబు గావించె. మీ చిన్ననాటి సురభి నాటకమున ప్రధాన నాయికా పాత్రమును ధరించి నటింపుచున్న నాటి శృంగార నటన చాతురి మాగి నమృతఫలము వలె, మీవయః పరిపాకంబు కొలందిని ప్రజ్ఞాన మాధుర్యమై వెలసినందుల కెంతయు సంతోషము. మీకు జగదీశ్వరుఁ డితోధికభ్యుదయ మొసంగ ప్రార్థించెద.

---

## 4

### శ్రీ పెద్దమందడి వెంకట కృష్ణకవి: గద్వాలాస్థాన కవి.

శ్రీయుత రాష్ట్రాటి సుబ్బదాస కవివరుచే రచింపఁబడిన యభిజ్ఞాన జయదేవ చరిత్రమను నాటక రాజమును జదువు భాగ్యము కలిగినది. ఈ కవి కవితాధార యనర్గళమై వియద్గంగా ప్రవాహము వలె నతి పవిత్రమై మృదుమధుర పద సంఘటితమై నాటక లక్షణమై భక్తిరస ప్రధానమై వినువారికి, ననవద్య హృద్యానంద సంధాయకమై యలరారుచున్నదనుట సందియ మించుకలేదను నా యభిప్రాయము పండితమండలి నమ్ముదురని నా నమ్మిక. ఇట్టి యాత్మానుభవ కవిశ్రేష్ఠునకు చిరతరారోగ్య మొసంగి బ్రోచుగావుత యని భగవానుని ప్రార్థింతును.

---

## 5

### శ్రీ కే. కోటిరెడ్డిగారు: సోంపాళ్యము.

తే॥ గీ॥ శ్రీ యభిజ్ఞాన జయదేవ, చరిత మరయ
భక్తి సుజ్ఞాన భావముల్, పలు విధముల
మదికి సమ్మోద మొదవించు, మహిమ గలిగి
సుమతులకు జ్ఞానబోధంబు, సొరిది జేయు

కం॥ సరసపద సౌష్ఠవంబున్
కరుణా రస పూరితంబు, కమ్రవచో సం
భరితంబు భవ్యనాటక
సరణిన్ విలసిల్లు సార, సారతరంబై

కం॥ కవి ఋషిగాన నిట్టికథ, కాలము దేశము వర్తనంబులన్
దవిశద వాగ్విలాస పటిమాదర మేదుర పాత్ర పోషణన్
కవితకు సొంపు నింపు నవకావ్య మృదూక్తుల బల్కినాఁడవో
కవినుత సుబ్బదాసు భవకారణ మానుషవేష భూషణా!

కం॥ గురు సింహదాస శిష్యా
భరణా సుజ్ఞానవేది, భాసుర సుహృదా
దరణా కరుణా వరణా
శరణా శరణాగతార్తి, క్షయంకరణా

శ్లో॥ సచ్చిదానంద రూపాత్మా సర్వ హృత్కమల స్థితః।
సర్వదా రక్ష్యతాం దేవో అభిజ్ఞాన జయదేవ కృతిం॥
శ్లో॥ రాప్నోతి సుబ్బదాసాఖ్యం అభినయ జయదేవం।
యోగక్షేమప్రదో భూత్వా పాల్యతాం పరమేశ్వరః॥
శ్లో॥ కే, కోటిరెడ్డి మిత్రేణ లిఖ్యతే పద్యమష్టకం।
అసమంతా త్సమాలోఖ్యా అభిజ్ఞాన జయదేవ కృతిమ్॥

---

## 6

### టి. శివశంకరం పిళ్లెగారు వకీలు, పెనుగొండ.

ఈ రచనయందలి కొన్ని పద్యములు గ్రంథకర్తగారు స్వయముగ చదువగ వింటిని. శైలి శ్లాఘ్యమైన ద్రాక్షాపాకము. కవితాధార అనర్గళము. ఇందలి విషయము సుబోధకము.

ఈ కవి చిన్ననాటినుండి నాటకానుభవము గలవాడు. ఇంతమాత్రమేగాక యీకవి నాటకాదులయందు ప్రధాన నాయకాపాత్రలను ధరించి అభినయించి ప్రజలమెప్పు వడసినవాడు.

ధర్మవరమున హఠయోగాశ్రమమును స్థాపించి, ప్రజాసేవ చేయు సుగుణుఁడు. నిరంతరము స్వయముగా హరికథలను రచించి ప్రతి పట్టణమున సంచరించి హరికథా రూపమున సంఘసేవ చేయుచుండును. యోగాభ్యాస సుపరిచితుడును యగుటచేత సర్వవిధముల కొంత యనుభవము గడించి ఆరితేరిన ధీశాలియని యీ నాటకమును చదివిన ప్రతివారికి తెలియకపోదని నా యూహ.

---

-

| పుట | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 35 | 24 | చిచ్ఛుకరణిన్మతి | చిచ్ఛుకరతిన్మతి |
| 40 | 1 | ష్రియత్న మేమియు | పురుష ప్రియత్నమేమియు |
| 60 | 17 | కంఠనాశ | కంఠనాళ |
| 63 | 24 | బుఝ్యనువర్తి | బుధ్యనువర్తి |
| 65 | 21 | గానుషింతమన | గా నుతింతమన |
| 68 | 18 | దితిక్షుణ | దితిక్షు స |
| 75 | 17 | తనువు దలచిన | తనువు దోచిన |
| 97 | 25 | నములచే | ణములచే |

# నాటకమున వచ్చు పాత్రలు.

## పురుషులు

| | | |
|---|---|---|
| (1) | సూత్రధారుఁడు | |
| (2) | యజ్ఞదేవుఁడు | కథానాయకి తండ్రి |
| (3) | జయదేవుఁడు | కథానాయకుఁడు |
| (4) | ధనముగుప్తుఁడు | జయదేవుని శిష్యుఁడు |
| (5) | భోగదాసుఁడు | కపటదాసుఁడు |
| (6) | నాగదాసుఁడు | కపటదాసుఁడు |
| (7) | సుమతి | జయదేవుని బండివాఁడు |
| (8) | సుదర్శనుఁడు | వింధ్యదేశపు రాజు |
| (9) | మంత్రి | రాజుమంత్రి |
| (10) | శ్రీకృష్ణుఁడు | దేవకీ తనయుఁడు |
| (11) | త్రివిక్రముఁడు | యజ్ఞదేవుని మిత్రుఁడు |
| (12) | మధుసూదనుఁడు | ధనముగుప్తుని పురోహితుఁడు |
| (13) | ప్రభాసుఁడు | రాజ పురోహితుఁడు |
| (14) | చెన్నుభట్లు | ఒక బ్రాహ్మణుఁడు |
| (15) | సుబ్బాశాస్త్రి | ఒక బ్రాహ్మణుఁడు |
| (16) | సేవకులు | మేనా మోయువారు |
| (17) | పరిచారకుఁడు | |

## స్త్రీలు

| | | |
|---|---|---|
| (1) | నటి | |
| (2) | సువ్రిత | యజ్ఞదేవుని భార్య |
| (3) | పద్మావతి | కథానాయిక |
| (4) | కళావతి | రాజుభార్య |
| (5) | ప్రమద | కళావతి సఖి |
| (6) | మంజువాణి | మఱియొక సఖి |
| (7) | దాసి | |

## విఘ్నేశ్వర స్తుతి

మ॥ ఒకఁడై, యాదిమ పూరుషుండునయి దా వ్యోమాకృతిం విశ్వముం
సకలంబుఁ నెఱినిండి చిత్సుఖరసా స్వాదాప్తినిఁ జొక్కుచుఁ
ప్రకటారి ప్రవినాశమౌ పరమతత్వం బేకదంతంబు నే
నికమోముం బెను బొజ్జయుం, కుడుము తిండిఁ గొల్తు విఘ్నేశునిఁ

## సరస్వతీ ప్రార్థన

మ॥ పరమంబౌ నలు రూపులం ప్రణవరూప ఖ్యాతి జూపించి సా
ఖ్య రసాకారత బ్రహ్మమోమున శ్రుతి వ్యాఖ్యానముం జేసి ని
త్యరతిఁ తన్భజియించు భక్తులకు బ్రహ్మానంద లాభంబుఁ దాఁ
బరమప్రీతి నొసంగు వాక్సతి పరబ్రహ్మాఖ్య సేవించెదఁ ॥

## సుకవి స్తుతి

కం॥ భక్తియు సుజ్ఞానంబు వి
రక్తియుఁ దన సొమ్ముగాగ రామబ్రహ్మ
సక్తిని భాగవతము నను
రక్తిఁ దెనిగించు పోతరాజుఁ దలంతుఁ

# నాంది



ఉ॥ శ్రీసతి నెప్పుడుం హృదయసీమ తిరంబుగ నిల్పి భక్తసం
త్రాసము బాప నాలుగు కరంబులు దాల్చి మహా పతివ్రతా
గ్రేసర ద్రౌపదీసతికి ఖిన్నతమాన్పిన కృష్ణదేవుం డీ
భాసురమా కృతి న్నిగుల బాగుగ సత్కృతుండై చెలంగుతన్॥

[సభాసదుల నలుప్రక్కలం బరికించి]

శా॥ భూమాభిక్యను బ్రహ్మవిద్యను ధరం బాల్పొందంగాంజేసి ని
స్సీమఖ్యాతి వహించు సద్గురువులన్ శ్రీ కృష్ణ గోవింద ము
ఖ్యామేయాత్ములం గొల్చి శంకర గురు ఖ్యాతిం బ్రశంసించి యా
భూమింగల్గు సమస్త యోగులను గేల్మోడ్పొప్ప సేవించెదన్

[నాంద్యంత్యమున సూత్రధారుఁడు ధ్యానమున నిలిచియుండును.]

నటి:-(ప్రవేశించి) నాయకా! ఏమిది, నిర్వికల్ప సమాధినుండు యోగీంద్రునివలె, మీరేల తూష్ణీంభావము బొంది యున్నారు. ఈ సభయు నట్టి యోగీంద్రసమితిన్ బోలి చలింపక యున్నది.

సూత్ర:-తన్వీ! నీవు చక్కగా నెఱింగి పల్కితివి. బ్రహ్మీభూతులగు మహాయోగులను స్మరించి, తన్మయత్వము బొంది నేనును, సభయు నమనస్కదశం బొంది యుంటిమి. మాకు నీవు వ్యుత్థానమొనర్చితివి. ఐనను నిప్పుడు నా చిత్త మానంద రసమున్ గ్రోలుచు, నా రుచిమరగి, బలవంతమున నైనను, బహిర్ముఖము గాకున్నది. ఏపనియుం దోపదు.

నటి:-ఆ దశ యట్టిదే! కాని యట్టి దశంబొందియు మహాయోగులు లోకానుగ్రహము కొఱకు చలింపకయే బహిర్ముఖవృత్తులై వ్యవహరించి యుండలేదా! చూడుము వేదవ్యాసమహర్షి

శా॥ వేదంబు ల్విభజించి సూత్రములఁ బ్రావీణ్యంబునన్ వ్రాసి స
మ్మోదం బొప్పఁ బురాణముల్ నుడివి సంపూర్ణంబుగా భారతం
బేదంరాని మహార్థ వార్ధి కరణిం హృద్యంబుగాఁజేసి యా
హ్లాదిం భాగవతంబు గూడ జగముల్ రక్షింపఁజేసెన్ గదా!

సూత్రి:-ఔను. వేదవ్యాస మహర్షి చరిత్రమును ప్రస్తావవశముగఁ జెప్పి, వారి యవతారమగు (శ్రీ) జయదేవుని చరిత్రం బీ సమయమున జక్కగా జ్ఞాపకము చేసితివి. దాని నిపుడు

తే॥ గీ॥ బ్రహ్మవేత్తల నడవడి ప్రజలెఱింగి
ధన్యులగుదురుగా యను తలఁపుఁగలిగి
తేట తెనుఁగున నొక మంచి నాటకముగ
వ్రాసె రాప్తాటి (శ్రీ) సుబ్బదాస సుకవి.

అది హరివాసరమగు నేడు ప్రదర్శింప నేనీ సభాసదులచే సభ్యర్థితుఁడనై యుంటిఁ గాని శాంత విషయాభిధ్యానంబున మఱచితి.

నటి:-అది స్వభావమే చూడు మార్యపుత్రా!

కం॥ లోకంబె మఱచి యుండరె
యీా కేవల శాంతవిషయ మంటినపుడు వా
ల్మీకి శమీకాది ఋషుల్;
లోకంబున నిట్టి చరితలున్ గొ్రత్తలొకో?

కావున నింకేల యాలస్యము. జయదేవునకు పద్మావతీ సతి నీవలయునని యామె తలిదండ్రు లాలోచించుచున్నారు. ఆ కల్యాణమహోత్సవముఁ జూడ బోవుదము రమ్ము.

సూత్రి:- మంచిది. అట్లే చేయుదము.

(నిష్క్రమింతురు.)



# అభిజ్ఞాన జయదేవ



1 వ అంకము. 1 వ రంగము.

జగన్నాథపురము—యజ్ఞదేవుని గృహము.

( ప్రవేశము:-యజ్ఞదేవుఁడు, సువ్రత )

యజ్ఞ:-మానినీ! సువ్రతా! మన వంశదీపము మన నోముల ఫలమునునగు మన ప్రియసుత పద్మావతికి నరులలో తగినవరుఁడు లేఁడని మనము దానిని భగవంతుఁడగు శ్రీ కృష్ణదేవునకే సమర్పించి యుంటిమి గదా!

సువ:-ఔను గాని, మనోనాథా! ఈవిషయమున లోకులాడెడు నిందనీయములగు మాటలను తాము వినలేదు కాఁబోలు. నే వినఁజాలకున్నాను. ఏమి యీ యోచన?

యజ్ఞ:-అదే నేనుఁ జెప్పవచ్చితి నూరకుము. సతీ! నాకు రాత్రి స్వప్నమున,

ఉ॥ శ్యామల కోమలాంగుఁడు విశాల పయోరుహలోచనుండు ది
వ్యామిత తేజుఁ డంచిత మహాభుజుఁ డావృత కాంచనాంబరుం
డా మహనీయమూర్తి కరుణార్ద్ర కటాక్షములన్ ననుఁ గనెన్

సువ్ర:-శ్రీ మహిళా మనోహరుఁడె, సిద్ధము

యజ్ఞ:- నే నటులే తలంచితిన్

సువ:-అప్పు డేమిచేసితిరి?

యజ్ఞ:- ఉ॥ ఏనతిభక్తి లేచి మొగమెత్తి ధరంబడి సాగిమ్రొక్కి వా
రానతి యియ్య వేచి వినయంబున నంజలిచేసి నిల్చితిన్

సువ్ర:-ఆహా! ఏమి తమ పుణ్యము. అంతట వారేమి సెలవిచ్చిరి? వేగమ చెప్పుఁడు.

యజ్ఞ:-తా నెలనవ్వుతో నిలను నా కళ వ్యాసమహర్షి తిందుబి ల్వాన ద్విజాత్మజుం డయినవాఁడు సుమీ జయదేవనాముఁడై

కం॥ అతఁడే నేనగుట మద
ర్పితయగు మీ ప్రియతనూజ శ్రీ కళపద్మా
వతి నతనికిందు పత్నిగఁ
గృతిమణు లయ్యెదరటంచు ప్రీతిం బలికెన్.

సుప్రి:- ఆహా! ఇది భగవదాజ్ఞ. ఇట్లే జరుగవలసియున్నది. దైవ రహస్య మెవ్వ రెఱుఁగఁగలరు. తిందుబిల్వగ్రామమున నొక బ్రాహ్మణ బాలుఁడు చదువు నేర్వబడకయే విద్వాంసుఁడైన వాఁడని వింతగా వినుచుంటిని. ఈతఁడే భగవంతుఁడు సెలవిచ్చిన జయదేవుఁడు గానోపు. వ్యాసావతారమే గాకున్న విద్య లట్లేల లభించు?

యజ్ఞ:-ఆ మహాపురుషుఁడు సామాన్య పండితుఁడేగాఁడని యాయన భగవంతునికి సంప్రీతి గలుగునట్లు రచించిన గీతగోవిందమని జగత్ప్రసిద్ధిగన్న యష్టపదియే సాక్ష్య మిచ్చుచున్నది.

సుప్రి॥ ఉ॥ ఇట్టి మహాత్ముఁ డల్లుఁడగు టెంతటి పుణ్యఫలంబొ

యజ్ఞ:- మానినీ
పట్టి రమావతారమని పల్కెఁ గదా భగవంతుఁడే

సుప్రి:— సరే
యిట్టి గుణోత్తమం సతిగ నేలఁగ నా జయదేవుఁడే తగున్
గట్టిగ వారి వేడుకొని కార్య మొనర్తము రమ్ము నాయకా!

యజ్ఞ:-మంచిది. అవశ్యముగ నట్లే చేయుదము.

తే॥ గీ॥ కూఁతుగాంచిన ఫలము సంప్రీతితోడ
నీడుజోడుఁగ బాల్నిరు నెట్టు లట్లు
కలిసియుండెడు నల్లుండు కల్గుటెకద
ఇట్టి యనురూప దాంపత్య మెందుఁగలుగు?

మఱియుఁ వినుమిపుడు లోకమున

తే॥ గీ॥ ఆఁడుబిడ్డను గాంచిన యట్టిమేలు
పొందలేరు ధనాశచే భూమి నిపుడు
హరిగ వరునెంచి కన్య నియ్యంగ దాత
ముందు పది వెన్క పది తరములు తరించు

సువ్రి:- (చిఱునగవుతో) వరుని హరిగాదలంచి కన్యనిచ్చిన నంత పుణ్యమా? మనము దానిని హరికే సమర్పించిన నింకెంత పుణ్యమో?

యజ్ఞ:-"శుభస్య శీఘ్రు" మ్మని యున్నది. జాగుసేయక మన మీ వివాహ కార్యము నతిశీఘ్రముగా జరిగింతము. దానికిఁ దగు మంగళద్రవ్యములు కూర్చుప్రయత్నము లొనర్చుము. గృహ మలంకరింపుము. నేను జయదేవునిఁ బ్రార్థించి యిటకు రావింతు. రేపు దశమి. మంచి ముహూర్తము. శుభంబగు. రమ్మ.

(నిష్క్రమింతురు.)



1 వ అంకము. 2 వ రంగము.

ఉ ప వ న ము.

[ప్రవేశము ఇద్దఱు విప్రులు]

చెన్నభట్లు:- యజ్ఞదేవుని శ్రద్ధ యెంత ఎక్కువైనది. ఈ కాలమున బ్రాహ్మ్యవివాహము. అందులో ఋతుమతియగు కన్య పద్మావతీ సతిని జయదేవ మహాకవి కిచ్చుట యెంతటి భాగ్యము.

సుబ్బాశాస్త్రులు:- చెన్నభట్లూ! యజ్ఞదేవ సువ్రతులకు నొద్దిక యెట్టిదో వారి పుత్రికయగు పద్మావతికిని, జయదేవునకు నొద్దిక నట్టిదే ఘటించినది. వారింగూర్చిన బ్రహ్మదే ప్రజ్ఞ.

చెన్ను:- సుబ్బాశాస్త్రిగారు! నిజము నిజము. వారి యన్యోన్యాను రాగము వారేకాంతమున మాటలాడుచుండ విని మనమును తెలిసికొని మన యిల్లాండ్రికా విషయమును జెప్పుదము. (ప్రక్కన జూచి) అదిగో! వారిప్పుడిచ్చటికే వచ్చుచున్నట్లున్నది. వారు నూతన దంపతులగుటచే మన యెదుట మాటలాడ లజ్జింతురు. మనమా ప్రక్కన నిలిచి వినుచుందము రమ్ము.

సుబ్బా:- అట్లైన పోవుదము రండు.

[నిష్క్రమింతురు]



1 వ అంకము. 3 వ రంగము.

తిందుబిల్వ గ్రామము - జయదేవ గృహము

(ప్రవేశము: జయదేవుఁడు, పద్మావతి)

పద్మా:- దేవా! తమదాసి ఇదే నమస్కరించుచున్నది.

(నమస్కరించును)

జయ:-కల్యాణీ! నీ కీప్సితార్థ సిద్ధియగు. ప్రాణేశ్వరీ! నిన్ను నా దాసిగా నేల తలంచుకొనియెదవు?

పద్మా:- మహా పురుషా!

సీ॥ మీరు పుట్టెదరని మీ తల్లిదండ్రుల
సేవించుచుండె లక్ష్మీలతాంగి
మీరుద్భవింపగ మిముఁ గొల్వవచ్చెను
శమదమాదులు కడు సంభ్రమముగ
తనయంతటనె శాస్త్రతత్వ స్వరూపిణియై
వచ్చి మిమ్ము వరించె వాగ్వధూటి
మీ హృదయంబు నెమ్మిని జేరి కాపురం
బున్నది బ్రహ్మవిద్యోత్పలాక్షి

తే॥ గీ॥ ఇట్టి మహాసీయు లైన మీా రెలమి నన్నుఁ
జేరదీసి వరించిన కారణమున
నేను ధన్యాత్మనైతి దయానిధాన
దాసి నే మీాకు దారగా దగను తగను.

జయ:-(దగ్గఱకుఁ దీసి చేయివైచి) సతీమణీ! నీ వినయ వివేకములెంత యుఁ నాకు మెప్పు గలిగించుచున్నవి. నీ యెదుట, నిను నే శ్లాఘింపఁదగదు. కాని నాకు పరమప్రీతి చేయుదానవు నీవు.

పద్మా:- కావుననే నే ధన్యనని నిరంతరముఁ దలంతు. మనోనాథా! వినుఁడు

చ॥ పతిమతి మెచ్చగా మెలగు భార్యయె ధన్య; హితంబు భర్తకుఁ
సతతమొనర్చి భక్తిమెయి సత్కృతిఁజేయునదే సుధన్య; యా
తతమతి భర్తమాట జవదాటనిదే కృతకృత్య; గాన నీ
ప్సితఫలసిద్ధి దానికగు సిద్ధముగానని నమ్మి యుండుదుఁ.

జయ:-ఔనౌను. చక్కగా వచించితివి. ఇంతమాత్రమే కాదుసుమా!

మ॥ పతిదా నేరమి గీడు పొందినయెడం బ్రజ్ఞా వివేకంబులఁ
సతులే భర్తలఁ బ్రోవజాలుదురు; కాంతా! మున్ను సావిత్రియుఁ
సతినిఁ జంద్రమతిఁ నలాధిపుని కాంతఁ సత్యచారిత్రలఁ
వితతఖ్యాతుల విన్నదానవుగదా విజ్ఞాన దీపాంకురా!

పద్మా:- ఇదియుఁ నిజమే. ప్రాణేశ్వరా! మఱి యొకమాట

తే॥ గీ॥ పెనిమిటియు భార్యయును నొక్క తనువె గాన
వారు సుఖదుఃఖముల వేఱుపడక కలిసి
యొకరి నొకరిని వీడక యుండవలయు
నిదియె బోధించు నర్ధనారీశ్వరుండు.

మఱియు,

ఆ॥ వె॥ భార్యయన భరింపఁబడునది గావున
భర్త దాని తెలివి బాగుజేసి

తనదు పుణ్యమందు దానికి సగమిచ్చి
ప్రోచుచుండుఁ గరుణఁ బుణ్యమూర్తి

ఇందుకు మైత్రేయియు, యాజ్ఞవల్క్యులే దృష్టాంతభూతులు నాథా !

సేవకుఁడు:-(ప్రవేశించి) స్వామీ! మనవి. దేవరవారి ప్రియశిష్యుఁడు ధనదుగుప్తుఁడు వాకిటఁ దమ యాజ్ఞకై వేచియున్నవాఁడు. ఏమి సెలవు.

జయ:- రమ్మనుము.

సేవ:- చిత్తము (నిష్క్రమించును)

పద్మా:- నాకు గౌరీపూజకు సెలవిచ్చెదరా ?

జయ:- మంచిది, నీవు వెళ్ళుము.

పద్మా:- (నిష్క్రమించును)

[ప్రవేశము ధనదుగుప్తుఁడు ఫల పుష్పములతో]

ధన:- సద్గురుప్రభూ! సాష్టాంగదండప్రణుతు లొనర్చెద. (పాదముల దగ్గఱ తట్టయుంచి సాగిలఁబడును)

జయ:- అయ్యా! కూర్చుండుము.

ధన:-(క్రింద కూర్చుండి) స్వామీ! సిద్ధికిని మనః ప్రసన్నతయే కారణమని సెలవిచ్చితిరి. మనోనిగ్రహమే దుస్సాధ్యముగా నున్నదే? ఎట్లు తత్ప్రసాదంబగు.

జయ:- నిజమే! దానిని నిగ్రహించుట వాయువును నిగ్రహించుట వంటిదని, యర్జునుఁడును నీవలెనే శ్రీకృష్ణమూర్తిని నడిగి యుండినట్లు శ్రీ భగవద్గీతయందున్నది.

ధన:- దానికి వారేమి యుపాయము జూపిరి?

జయ:- అభ్యాసము, వైరాగ్యము నను వీనిచే, నది సాధ్యపడునని యుపదేశించిరి. ఇదియే పతంజలి మొదలగువారి మతమును.

ధనః- అభ్యాస వైరాగ్యముల స్వరూపమును, దయ కటాక్షముచే నెఱింగి కృతార్థుఁడనయ్యెద. విషయ విషసముద్రమునంబడి, మునుంగుచుం దేలుచు, జన్మ, జరా, మృత్యు, చక్రమునఁ బడి భ్రమించుచుండు నన్ను దయారసముచేఁ గాపాడి దరిఁజేర్చవలయు. దీనికి మీరే దిక్కు. నన్ను పాల ముంచినను, నీట ముంచినను, నాకు మీరే గతి. నేనేమియు నెఱుంగని పశువును. నాకు హితముపదేశించి కడతేర్చుఁడు, మహాస్వామీ !

(జయదేవు కాళ్ళను పట్టుకొనును)

జయః- (తలమీఁద చేయియుంచి) భయపడకుము. మృత్యుకల్పితము లగు విషయములయందలి మాధుర్యమును కాలకూటముగా తిరస్కరించు నీవే యధికారివి. నీకు ముముక్షుతయు, తీవ్రముగా నున్నది. కావున నవశ్యముగాఁ జెప్పెదము. సావధానముగా వినుము.

తే॥ గీ॥ నేమమును గొని మను మూని నిలుచుదాని
గానవచ్చెడువానిలో గలయకుండ
వేఱుపడజేసి బిగబట్టి విడువకుండ
నిలుపుటభ్యాససరణి సందియము వలదు.

ధనః- స్వామీ! మర్మముగా బల్కితిరి. నాకర్థము కాలేదు. మందమతిని.

జయః- అర్థమా! వినుము. (కుడిచెవిలో జెప్పును)

ధనః- సరి. ఇఁక వైరాగ్యమన నేలాటిది?

జయః-

ఆ॥ వె॥ ఇట్లు నిలిపినదానితో నెనయఁబూని
పెరవి జేరంగనీక చెచ్చెఱ నిరాక
రించుచుండుట వైరాగ్యరీతి పుత్ర !
దీని నన్ని యవస్థలఁ దెగక నడపు.

ఇట్లీ రెంటం మనో నిగ్రహమగు. అంత నచిర మనఃప్రసాదంబగు. అదియైనఁ బరమాత్మ దర్శనంబగు. అంతట నీకు పుట్టు వను దుఃఖము పొరయదు. ఇది సర్వశాస్త్ర సమ్మతము. స్వానుభవ సిద్ధము. సత్యము. దీనిని విన్నావుగదా! ఇక దీనిని మననము చేయుము. అవ్వల నిధిధ్యాస మొనర్తువుగాక.

ధనః- మహా ప్రసాదము. (ధ్యాన మభినయించి)

కం॥ ఇది కడు రమణీయంబై
ముద మొదవించెడు మహాత్మ! పొలుపణగెను నా
మదిని వికల్పవ్యథ లె
స్స దయాహృదయా! లభించె స్థైర్యము నాకున్.

( యో చిం చి )

తే.గీ॥ ఐన నొక విన్నపమును తా మాదరించి
విని ననుఁ గృతార్థుఁజేయంగ వేఁడువాఁడ

జయః- ఏమి చెప్పుము

ధనః- మా యింటి కేగుదెండు
తమ పదస్పర్శ నది పవిత్రంబుగాఁగ.

జయః- కం. మీ యూరు దవ్వొకో?

ధనః- లే, దీయెడకు న్నూఁడు క్రోసులే; పాలకియున్
వేయించెద దయసేయుఁడు
మా యమ్మయు మీరు భక్తమందార నిభా!

స్వామీ! యింతమాత్రము తమ దాసుని ప్రార్థన నంగీకరింపవలయు. (చేతులు జోడించి నిలిచియుండును)

జయః- (యోచించి, ప్రకాశముగ) పద్మావతీ!

పద్మాః- చిత్త మిదే వచ్చితిని.

జయః- చూడుము

కం॥ ఈతఁడు మన పుత్త్రికుఁ డగు
నాతతమతి ధనదుగుప్తుఁ డనువాఁడు సతీ

ధన:- తల్లీ! నమస్కారము. (సాష్టాంగపడును)

పద్మా:- దీర్ఘాయుష్మంతుఁడవగుము పుత్త్రికా!
ఈతని కోరిక యెయ్యది?

జయ:- గోతీ! తనతోడ మనల గొనిపోవుటయే.

పద్మా:-
గీ॥ ఇతని యూరిక్కడికి నెంత?

జయ:- యెంత! మూఁడు
కోసులఁట! యచ్చటికి పోయి కొలదికాల
ముండివచ్చెద

ధన:- నమ్మగారో?

జయ:- అదేల?
ఇంట నెవ్వరు లేకుండ నేలపోవ?

పద్మా:-
కం॥ నేనున్వచ్చెద నాథా!

జయ:- మానిని వలదేల మానుమా పయనంబున్

పద్మా:- ఏ నేమి తప్పుఁ జేసితి
నో నాయక! నన్ను బాయ నుంకించెద రే?

జయ:- నీవు తప్పుచేసితివని కాదు. ప్రాణేశ్వరి! శీఘ్రమే మఱలివత్తు
గాన, నీకీప్రవాస ప్రయాసయేలయని, యిట్లు చెప్పితిని. నిలువుము.

పద్మా:-
కం॥ నిలువుమను మాట నాథా!
ములికిగ నా చెవికిసోకి పొక్కించె నను౯ (విన్నబోవును)

జయ:- వెలవెలఁ బోవకు సుదతీ!
కలఁగకు వేగంబెవత్తుఁ గ్రిమ్మఱ నిటకు౯.

పద్మా:- సీ॥ తమయాజ్ఞ జవదాటఁ దలకెద నోకాంత!
జయ:- వలదుండి యుత్తమామల భజింపు
పద్మా:- మిముబాయ నొకనిమేషము నాకు కల్పమా
జయ:- నేల? శీఘ్రించె నే నిందువత్తు
పద్మా:- నే నొక్కతను మీకు నింత భారంబొకో
జయ.- కాదు-బాలవు; నీకుఁ గష్ట మచట
ధన:- (జయదేవుని జూచి) కష్టమేలగు? నమ్మగారిని రానిండు
జయ:- వలదింట నుండగావలయు లెమ్ము
పద్మా:- గీ॥ అన్నిటికి నన్నివచియింతు రక్కటా! (వ్యాకులపడును)
జయ:- యదేల వగచెద వ్రూరకుమెూ లతాంగి
పద్మా:- వెనుక జూతము; భోజనంబునకు లెండు
జయ:- (ధనదుగుప్తునితో)
తరలుదము భోజనముచేసి ధనదుగుప్త!
ధన:- చిత్తము మహాస్వామీ! నేనును భోజనమును జేసివచ్చెద. సెలవిండు.
జయ:- మంచిది. వెళ్ళుము. (పద్మావతితో) మనమును పోవుదము రమ్ము. (అందఱు నిష్క్రమింతురు)

[పరదా వెనుకనుండి అశరీర వాక్కు)

ఓహో! మానవులారా! వినుఁడు. నే నీశ్వర సంకల్పమను. నాకు మూఁడు లోకములను నెదురు లేదు. నేను సర్వ జంతు హృదయములనుండి, యవి చేసిన కర్మఫలము ననుభవింపఁజేయు చుందును. ఎఱుఁగరా? నాడు బ్రహ్మహత్య జేసిన శివుఁడును, పర దారగమన మొనర్చిన ఇంద్రుఁడును, నాయాజ్ఞ దాటలేరైరి. తక్కటి వారన నా కెంత? ఇప్పుడీ జయదేవుఁడుగా పుట్టిన వ్యాసుఁడు, మున్నొ నర్చిన వ్యభిచార ఫలమును, నిప్పుడు చేజేత ననుభవింప నున్నాఁడు.

అంతకు ముందు నేనొనర్చు సంవిధానము జక్కగా జూచుచుండుడు. అదిగో! జయదేవుఁ డిదె పద్మావతీదేవితోడ భోజనముచేసి వచ్చుచున్నాఁడు.



1 వ అంకము. 4 వ రంగము.

జయదేవ గృహము.

పద్మా:- (తాంబూల మిచ్చుచు) ప్రాణనాయకా!

కం॥ ఎన్ని విధంబుల వేడిన
నన్నేలా తోడికొని చన స్మతిరాదే?
వెన్నంబోలిన మీమతి
యెన్నం బాషాణమయ్యె నెద్దానఁ గటా!

జయ:- (స్వగతము) కారణ మీయబలకుఁ, జెప్పరాదు. చెప్పిన మఱియుఁ గావగచు. ప్రయాణమని చెప్పినతోడనే, నేనును వత్తు ననియు భోజనము సేయరమ్మనియు, నప్రియత్నమున నీ కాంత యవాచ్యములాడె. (యోచించి) కాన యందేదేని నాకొక్క కీడు రానున్నది కాబోలు. కానిమ్ము. అనుభవింపవలసినవెల్ల నను భవింతునుగాక! అట్టిచో నీ కోమలియున్న, దీని నే సమాధాన పఱుపఁజాల. (ప్రకాశముగ) కల్యాణీ! కారణ మేమియులేదు. నీ వబలవనియు, ప్రవాస మెన్నడెఱుఁగవనియు, స్వాతంత్రముగ బనిచేయఁజాలవనియు, వృద్ధులగు నత్తమామల చాటుననుండి, వారికి శుశ్రూష చేయుచుండవలయుననియు నా యభిప్రాయము. వేఱుగా తలంపకుము. చింత నొందకుము. ఊరడుము. (వెన్ను జఱచును)

ధన:- (ప్రవేశించి) స్వామీ! నమస్కారము. దేవరవారి భోజన మైనది గదా?

పద్మా:- (స్వగతము) వచ్చెగదా పీడను. నాకు నా పతి నెడసేయు ద్రోహి. అయ్యో! నా గుండెలు తటతట లాడుచున్న వే! యేమి సేయుదు?

జయ:- అయినది. మఱి వెడలుదమా?

ధన:- ఆలస్యమేమియు లేదు. పాలకియు సిద్ధమై వాకిట నున్నది.

జయ:- అట్లైన వెళ్లుదము. ప్రాణప్రియా! పోయివచ్చెద.

పద్మా:_(తలవంచి కన్నీరు దుడుచుకొనుచు) చిత్తము. తమ దాసిని మాత్రము మఱవకుఁడు.

ఆ॥వె॥ గడియ లెంచుకొనుచు కాలంబు గడిపెద
బొందెయుందు ప్రాణ మందెయుండు ;
మీరు నాదు ప్రాణమే గాన, మీరిందు
వచ్చువఱకు నాదు వపువు శవము.

జయ:- (స్వగత) కృష్ణ! కృష్ణ! నేబాయుట నోర్వక యీ బాల నే డిట్టి కఠినపు మాటలాడుచున్నది. (ప్రకాశముగ) పద్మావతీ! నే నిందే యున్నట్లు భావించుకొనుము. ఇదే వచ్చితి. పోవుదము నడువుము గుప్తా! (ఇద్దఱు వెడలుచుందురు)

పద్మా: (ధనదగుప్తుని నాపి) నాయనా! ధనదుగుప్తా (వ్రేలితో జయదేవుని జూపి)

తే॥ గీ॥ ఇమ్మహాత్ముఁడు నా ప్రాణమే; యెఱుంగు
మితని జక్కఁగ; నింగితంబెఱిగి కొల్వు;
మితఁడె దైవంబుగా మదినెంచి చూచి
యెలమి గొనివచ్చి నాప్రాణ మిచ్చిపొమ్ము.

అయ్యో! ఇంతకు నెక్కువగాఁ జెప్పఁజాల.

ధన:- మంచిది తల్లీ! అట్లే చేసెదను. (దేవికి నమస్కరించును)

పద్మా:- (జయదేవు పాదములకు మ్రొక్కి) నాథా! నాకు సెల విచ్చెదరా?

జయ:- కల్యాణీ! సుఖవై యుండుము. (నిష్క్రమింతురు)

పద్మా:- (ఇల్లు నలుప్రక్కల జూచి)

ఉ॥ వెన్నెలలేని రాత్రి, యరవిందములేని సరోవరంబు, స
త్సౌన్నతిలేని భాషణము, నూత దొలంగిన తీగ, చూపు లే
కున్నఁ దలిర్చు కన్ను, విమలోజ్వల దీపములేని గేహముఁ౯,
వన్నియలేని హారున్ను; పతిబాసిన కాంతల జీవనం బహో!

అది యేల కాల్పనా?

కం॥ మామయు నత్తయు లోనగు
వేమందియు కోటిధనము వృద్ధిగ నున్న౯
స్వామిని నెడబాసినచో
కోమలికి సుఖమ్ము గగన కుసుమంబె కదా?

మధువన మిచ్చటికి మూఁడు క్రోసులే గదా! ఇప్పటికి నా ప్రియుఁడా యూరు చేరి సుఖమైయుండును. కొంతకాలము వారిరాకకై వేచియుందును. వారిట త్వరరానిచో, వారి సన్నిధికి నొక విప్రుని బంపి రావింతును. హృదయమా! ఊరడిల్లుము.

(నిష్క్రమించును)



2 వ అంకము. 1 వ రంగము.

(మధువనపురమున జయదేవుని విడిది)

జయః-ఇది మధువనపురము గదా. ఓహో! స్వప్నము మనఃకల్పితము. నాకు దుస్స్వప్నమేల రావలె? దుర్వాసనలా దానికి లేవు. (యోచించి) సరి సరి. అది త్రికాలవేది కావున ముందు రాఁబోవు కీడునే సూచించినది. ఆహా! నా వామభుజ మదరుచున్నది. ఇది దానిని స్థిరపఱచుచున్నది. కాని, కానున్నది కాక మానదు. (ప్రక్కన జూచి) అదిగో! ధనదుగుప్తుఁడు వచ్చుచున్నాఁడు.

ధనః- (ప్రవేశించి) స్వామీ! నమస్కారము.

జయః- (కూర్చుండఁజేసి) ఇప్పుడు నీ యనుభవం బేరీతిగా నున్నది?

ధనః- తమ కృపాకటాక్షమువలన, నేనీ జడమలరూప శరీరోపాధిని విడిచి నా నిజరూపం బెఱింగి నిలువ నేర్చితి.

జయః- మంచిది. నీవు కృతార్థుఁడవైతివి. ఇఁక నీవు

తే॥ గీ॥ ఏది నీ రూపుగా లెస్స నెఱిఁగికొంటి
వదియె యీ సర్వమునటంచు గుదురు పఱచి,
యంతటను నిండి నీయందు నన్నిగనుచు
నుండుమయ్యా యఖండత్వమొంది పుత్ర!

ఇది సాధించి, నిరతిశయ సుఖం బొందుచుండుము. (యోచించి) మే మిచ్చటికి వచ్చి దాదాపుగా నొక్క మాసమైనది. వచ్చునపుడు పద్మావతి యెట్లు వలవల పలవించుచుండెనో నీవుం జూచితివి కదా! ఇఁక మేమిందుఁ దడయఁజనదు. నేఁడూరికి ప్రయాణము చేయుదుము.

ధనః- చిత్తమట్లే కానిండు. నేను తమ పాదారవిందములు విడువజాలకున్నను, మా యమ్మగారి వగపుఁ దలచినప్పుడు తమరి నిందు నిలువుఁడనుటకు నోరాడకున్నది. భోజనానంతరము తమ దాసుని యింటివఱకు దయచేయవలయు.

జయ:- ఏల?

ధన:- తమ పాదసరోజములు పూజింప దాసున కిచ్చ గలుగుచున్నది. అనుగ్రహింపవలయు.

జయ:- (చిఱునగవున) మహామతి మా పాదముల నీవు ఐక్యానుసంధానరూపమైన నమస్కార మొనర్చుచు, నిరంతరము పూజించుచునే యున్నావు. ఈ శల్య మాంసములు మా పాదములు కావు. వినవా? అవి

తే॥ గీ॥ మాటలను మానసమునందు చోటులేక
తెలుపు నెఱుపును మిశ్రమై తేజరిల్లు
నిట్టి వట్టి వటంచు నూహింపరావు
మూఁడు పురముల వెల్గించు జోడుగూడి

అట్టి మా పాదముల పూజించిన నీకీ పాదముల మరల పూజింప నేల ?

ధన:- అది సత్యమే కాని, మహాస్వామీ!

కం॥ లోకంబు నుద్ధరింపఁ ద్రి
లోకస్తుత్యాత్మ! భువి వెలుంగునుగద మీ
పాకట దేహం బయ్యది
నాకుఁ బూజింపఁదగు సనాతన బుద్ధిన్

మఱియు, దేవా!

కం॥ వినయమున శిష్యవర్యుఁడు
తన తనువును, మనము, ధనము, తద్గురుసకు న
ర్పన సేయవలయు ననుటను
వినియున్నా నిది యొనర్ప వేడుక నాకున్.

తే॥ గీ॥ ఇందు తనువును మనము మీ కిచ్చినాఁడ
మీకు వశవర్తినై భక్తి మెలఁగు కతన;

నింక నా ధనమును తమ కియ్యవలెనె ?
దానిగొనుఁ డంత నే ధన్యతను వహింతు.

జయ:- (నవ్వి) ఇది కాదు దాని యర్థము. వినుము

తే॥ గీ॥ తనదు తనువును-మనమును-ధనము-గురున
కిచ్చుటన నవియెల్ల వారే యటంచు
గాంచి విడచుటె యర్పణగాని, గురున
కవి యొసంగుట కాదు; సత్యంబు వినుము.

కం॥ గురువనగ మూఁడు మూర్తులు
గురువన నా బ్రహ్మ మదియె కోటియిఁ కేలా
పరమాత్మ కేమి కావలె ?
నరయగ సర్వంబు దానె యయ్యుండంగన్.

కాబట్టి మాకేమియు నక్కఱలేదు. నీవా తలంపు మానుము.

ధన:- నే నిట్లనెదనని యన్యథా తలంపక నన్ను మన్నింపదగు. వేదమున నయితము, నాచార్యునకు బ్రియమగు ధనమునిచ్చి శిష్యుఁడు వారి సెలవుపొంది వెళ్ళవలెనని యుండలేదా ?

జయ:- ఔను. ద్రవ్యము లోహరూపము. లోహము మృద్వికారము. అట్టి మన్ను మాకేల ? మా ప్రియమైన ధనము నీ యనన్యభక్తియె. అంతియె చాలును. ఇంక నా ప్రశంస వలదు.

ధన:- చిత్తము. సర్వజ్ఞులగు తమకు నే నెదురు చెప్పగలంత వాఁడను గాను. (స్వగతము) నే నెన్నెన్ని విధములనో సత్యానృతవృత్తిచే ద్రవ్య మపరిమితముగా సంపాదించి యున్నాను. అది యిట్టి సత్పాత్రమందు వినియోగపడు ప్రాప్తి గలిగిననే కదా సార్థకమగు. వీరో! నిష్కాములు. నే నెంత ప్రార్థించినను నొక్క తృణమైనన్ బరిగ్రహింపరు. ఇన్ని దినములిచ్చుట వీరిన్నిలిపినదే యెక్కువ. కానీ! పూర్వము దిలీప మహారాజు మహారణ్యములలో వెదకి వెదకి ఋషీంద్రుల పర్ణశాలలకు ధనము గొనిపోయి

బలవంతముగా వారికిచ్చి కృతార్థుఁడవ్యోనని వినియుంటిఁ గదా! నేను వీరికి రథమమర్చి వీరికిఁ దెలియనట్లుగ నందు ధనము నింపి, దానిపై మెత్తవేయించి, వీరి నందుపై నివసింపఁజేసి నా బంట్ల కిద్దఱి కీ రహస్య మెఱింగించి, ఇది నా నమస్కృతిశతపూర్వ ముగా మా తల్లిగారగు పద్మావతీ మహా పతివ్రతామతల్లిగారికి సమర్పించి వచ్చునట్లు దిట్టపఱచి యంపెద. ఎట్లయిన నా ద్రవ్యమిా మహాపురుషుం జెందిన నంతయే చాలు. (ప్రకాశముగ) మహాస్వామిా! భోజనానంతరము తమ చిత్తముచొప్పున ప్రయాణము చేయింతును. రథము సిద్ధపఱపించెద.

జయ:- మంచిది. అట్లే చేయుము. మేము స్నానమునకు వెళ్ళెదము.

ధన:- చిత్తము. (నమస్కరించును)

జయ:- సుఖంబుండుము.

[ఇరువురు నిష్క్రమింతురు]



2 వ అంకము. 2 వ రంగము.

## అ ర ణ్య ము.

[ప్రవేశము: రథమున జయదేవుఁడు - భోగయ్య, నాగయ్య యను బంట్రోతులు బండివెంట నడువ, సుమతి యనువాఁడు బండి తోలుచుండును]

భోగ:- ఓరి తమ్ముడా! నాగయ్యా! యీ బాపనయ్య మన సెట్టి గారికి యీామాట యాామాట చెప్పులో వ్రాది యెంతధనము బండికి యేసుకపోతాడో సూడాా. అది తల్చుకుంటె, ఆ బండివంక సూస్తే నాకు పండ్లు పులుస్తాయి. మనకు సెట్టియిచ్చేది నెలకు మూడు మాళ్ళు. ఇవి యెన్నేళ్ళు కూడేస్తే యింత ధన మాతుందిరా?

నాగ:- దినాలకు యేండ్లకు కాదురా-భోగయ్యా! యెన్ని జన్మాలకు కాదురా. ఇప్పుడీ యడవిలో యెవ్వరూ లేరు. బాపనయ్య వక్కడు, బండివాడొక్కడు. వీరా వట్టి చేతుల నున్నారు. మనవూ జట్టీలము. ఈ కట్టెలా ఆ యముడి కట్టెలు వంటివి. ఒక్క యేటుకే వీండ్లిద్దరిని నేల పండబెట్టగలము. కానిత్తామూ యేంటిరా అన్నా!

భోగ:- తాళురా! తొందఱపడబోకు. ఇంక కొంచ మడవిలోకి పోనీ.

సుమతి:- ఓరీ బంట్రోతులారా! చాలా వెనుక చిక్కినారు. బండి వెంట రండి. అడవి బలవౌతుంది. జాగ్రత్త!

నాగ:- వస్తున్నామయ్యా! ఇదో కలుసుకుంటిమి. ఏమి భయము లేదులే. పా.

భోగ:- అట్లకాదురా! నాకింకొక్క ఆలోచన తోస్తున్నాది. వినురా! ఈ నెల్లాండ్లనుండి మన మీ బ్యామ్మని మొగము సూస్తున్నోళ్లము. ఈ రూపకముతో ఈన్ను కొట్టబోతే యీాన మన మొగము సూస్తానె మనకు సేతులాడవు. కొట్టబోయి కొట్టక పోతిమా, యనక సెట్టికి దెలిస్తే మన ప్యానాలే దక్కవు. మా లేక్కము యేసుకోని వత్తాముురా!

నాగ:- అయితే యెళ్లుదాము పద. (పోబోవును)

భోగ:-(చెయి బట్టుకొని) వరే! అట్లకాదురా దబ్బరోడా! అయ్యతో బొంకి మాయసేసి యెళ్ళుదాము రారా! (బండితో కలుసుకొని) స్వామీ! తాము నాయందు దయవుంచాల.

జయ:- నాయనా! యేమది? ఏమి కావలెను చెప్పుము.

భోగ:- నాకేమి వద్దు. కానీ, నాయింట్లో మా ఆడది కనపొద్దులై పొద్దున నొప్పులు పడుతుంటె, సెట్టిమాట తీసేయలేక యిట్లా వచ్చినాను. నా పానాలంతా ఆణ్ణే తగులుకున్నాయి సామి. దయసేసి సెలవిప్పిత్తావా? నాకంతేసాలు బాబయ్యా! మీ దయ.

దిక్కు లేని బీదోన్ని పెబో.

జయ:- అటులనా? ఐన సెవు నిలువుము. మాకు తోవజూపను నాగదాసున్నాడు చాలును.

భోగ:- చిత్తము. బాబో! రచ్చించాను. దండాలు దండాలు (మొక్కి వెళ్లును)

నాగ:- (బండిని కొంతదూరము పోనిచ్చి, యెడమ చేతితో కడుపును పట్టుకొని వంగుచూ) అబ్బా! అ...బ్బ...బ్బ...బ్బా. ఏమి నొప్పి. యేమినొప్పి. చచ్చాంరో బాబూ యిక్నో!

జయ:- ఏమయ్యా! ఏమది? (సుమతితో) సుమతీ! బండి నిలుపుము ఇతడేమో బాధపడుచున్నాడు. (బండి నిలుచును)

నాగ:- ఊ...(అని వణకును)

సుమతి:- ఏమిరా! చాల బాధపడుచు వణకుచున్నావు. ఏమి బాధ చెప్పుమా?

నాగ:- ఏమిచెప్పను స్వామీ! అ...బ్బ...బ్బ...బ్బా...నిలచి నిలచి తగులుతుంది. కడుపునొప్పి అబ్బో! (అని కడుపు వొత్తుకొనుచు యేడ్చి) యింక నేను నడువలేను స్వామీ, కాస్తసేపు నేసీ చెట్టు కింద పడుకొంటా నొప్పి అణిగినపాళ్ళే వచ్చి బండితో కలుసుకుంటా. (పండుకొనును)

జయ:-(సుమతితో) అయ్యో! వీడు రాజాలడు. మాడు మెంతబాధ పడుచున్నాడో? నీకు తిందుబిల్వము తోవ తెలియును కదా? మనకు తోడెందుకు? ఇక కొంత తడవునకు యీ యడవి దాటగనే యూరువచ్చునే. బండిని పోనిమ్ము.

సుమ:- అడవి స్వామీ! కాలమూ చెడ్డది. పైపంచెలు దక్కడం లేదు.

జయ:- (నవ్వి) ఐన మనకేమోయి భయము? మనయొద్ద నేమున్నది? "ధనముండుచోట భయముండును." కట్టు పుట్టములు దప్ప, మరేదియు లేదు. దొంగలు వచ్చి వలయునన్న నివియు నిత్తము. భయ

మేల? పోనిమ్ము.

సుమ:- చిత్తము. (బండిని తోలును)

(తిన్నగ కండ్లు దెఱచి తలయెత్తిచూచి త్వరగ గంతులువేసి ప్రక్క పరదానుండి మారువేషముతో కత్తులు పట్టుకొని నాగయ్య, భోగయ్య ప్రవేశింతురు)

భోగ:- వృత్తము.

వచ్చితిమిదె, వచ్చితిమిదె వచ్చితిమి సుడీ

నాగ:- వ్రచ్చెదమిదె గ్రుచ్చెదమిదె గ్రచ్చఱ గనుడీ

భోగ:- ముచ్చులమై వచ్చితిమిక బుచ్చెద మితనిన్

నాగ:- చెచ్చెర జము బిచ్చముగొన నిచ్చలము వనిన్

ఊఁ-ఊఁ. చూడు నాయేటు. ఈ బాపఁ డేమనుకున్నాఁడో?

భోగ:- పంచ చామరము

ధరామరుం డటంచు గొప్ప ద్రవ్యయుక్తుఁడై వనాం

తరంబునం రథంబునెక్కి దక్కనంచు పోవురా

నాగ:- అరే! బిరాన రార పోయి అట్టివాని గొట్టియున్

హరింతమా వరాలహా మహా సుఖంబు గల్గురా

భోగ:- సుగంధి వృత్తము

ఎవ్వరైన వత్తురేమొ యెందుకింత జాగరే!

నాగ:- గొవ్వడంచి వాని డబ్బు గొల్లగొంద మన్నయా!

భోగ:- నెవ్వబుట్టి బండివాఁడు నిల్వకుండ తోలెరా!

దవ్వుపోదు రేమొ రమ్ము దక్కు డబ్బు తమ్ముఁడా!

(బండికడ్డముగ నిలిచి కత్తులెత్తుదురు)

సుమతి:- (వణకుచు) వద్దప్పా! వద్దు. మీకు దండము పెడుతాను. [దండముపెట్టి జయదేవునితో] స్వామీ! దొంగలు దొంగలు.

నాగ:- వేయరా! యేమింకా చూస్తావు. (బండివానితలపై కొట్టుదురు)

సుమ:- (ఏడ్చుచూ) కొట్టవద్దురా నాయనా! నేనేమియు దాచుకోలేదు. నావద్ద యుండేదంతా తీసుకోండి. [పై పంచలు తీసి పారవేయును]

నాగః- ఈడ్చురా మొదట వీనిని క్రిందికి. (ఈడ్చుదురు. బండివాఁడు క్రిందపడును)

భోగః- ఇట్ల వుండు. కదిలేవు. జాగ్రిత. (అని చెట్టుకు కట్టుదురు)

సుమః- లేదప్పా! (అని వణకుచూ నిలచియుండును)

భోగః- వరే! (బండికియుండు ఎడ్లను విప్పి) బాపనయ్య బొడ్రాయి వలె కదలక బండిలో కూర్చున్నాడు చూడరా! ఇట్ల రారా బ్యామ్మడా. (ఇద్దఱు జయదేవుని క్రింది కీడ్తురు)

జయః- నాయనలారా! మీకేమి కావలెనో పుచ్చుకోండి. మమ్మేల కొట్టెదరు. మేము ధనమేమియు దాచుకొనలేదు. చూచుకోండి.

భోగః-లేదూ? లేదూ? ఛీ! తప్పుడు బ్యామ్మడా! అందఱికి గ్యానాలు సెప్తావు. నీలోనే సత్యం లేదు. థు...థూ. (అని మొగమున మూయుదురు)

నాగః- తన్నరా తప్పుడువాన్ని. ఇంకా మాట్లాడుతావ్ గొడ్డు బ్యామ్మనితో. (కాలితో తన్నును)

సుమః-(స్వగతము) హరి హరీ! ఏమి యన్యాయము. ఎంత పాపము.

జయః- (క్రిందబడి మట్టిలో పొర్లి లేచి ఎంగిలియు, మట్టియు తుడుచు కొనుచు) మా తండ్రులారా! పరమేశ్వరుడు మీకు మంచి బుద్ధి దయచేసి మిమ్ము రక్షించు గాక!

భోగః- (హాస్యముగ) తాము పెద్దలు గదా! పాపాత్ములైన మాకు మంచిబుద్ధి కలుగవలెనని దీవిస్తారో?

నాగః- కాదురా! చెడ్డ బ్యామ్మడా! సిగ్గులేదా? బాపనయ్యనని పేరు పెట్టుకొని డబ్బేమీ దాచలేదని కటిక అపద్ధ మెట్లాడేతివయ్యా?

భోగః- అయ్యనా వీడు- హి...హి...హి...హి...హి.

జయః- నాయనలారా! నిజము. నేను డబ్బు దాచుకోలేదు. ప్రమాణముగ చూచుకొండి.

భోగః- ఓరి మొండోడా, ప్రమాణమూ చేస్తావుగా?

నాగ:- వరే! యీాడి మొఖంచూస్తే వెయ్యిలచ్చలు బ్రహ్మాత్యలు వస్తవిరా. ఛు. ఛు. ఛూ. (అని యిద్దఱు మరల మూాయుదురు)

సుమ:- [స్వగతము] నారాయణ! నారాయణ! సద్బ్రాహ్మణుఁడే! అయ్యో! పాపము.

జయ:- (కన్నీరు నుడుచుకొనుచు) శ్రీహరీ! ఈ దేహమేమి పాపము చేసినది? వీరు దీని నిల్లేల దయలేక పీడించుచున్నారు. వీరికే పాపము రానీక మన్నించి రక్షించవే పతిత పావనా! మహానుభావా! దయాసాగర.

సుమ:- (స్వగతము) హా! యెంత శాంతుఁ డీ బ్రాహ్మణుఁడు. ఏమి దయాళువు?

నాగ:- అన్నా! ఈ పాడువానితో పొద్దస్తమాన మగుచున్నది. వీనితో యేమి మాటలు.

భోగ:- తాళరా! వీడు బెమ్మగ్యానంట. అందరికి అబ్దాలు శెవులో పూాది వాండ్ల డబ్బంతా నూకొ్నిపొయ్యే మోసగాడు. వీని నిజమైన కనుక్కుందాము.

నాగ:- నిబద్దిగా అడుగు అయితే.

భోగ:- వరే యెజ్జి బ్యామ్మడా! నిజంగ దేవుడుసాచ్చి, పెమానంగ నీవు డబ్బు దాచుకోలేదటా్రి? చెప్పు చూాత్తాం.

జయ:- నాయనా! నిజముగ లేదు. నీవే ప్రమాణము కోరినను చేయఁగలను.

భోగ:- ఓరి పాపీ! కూాళా పరమ చండాలా! యెంత అబ్దము చెప్తావురా. ఐతే యిట్లరా! (రెట్టబట్టి యీడ్చును.)

నాగ:- పదరా పద. నీ సత్యమేంటో సూాత్తాము. (మెడబట్టి బండి వద్దకు నెట్టును. జయదేవుఁడు బండివద్ద నిలుచును. దొంగలు పరుపును తీసి బండినగలెత్త ధనముమూటలు క్రిందపడును)

సుమ:- ఆహా! ఎక్కడివివి? దేవుఁడనుఖ్ఖాఁడు లేఁడా?

భోగ:- చూడరా! నీ ప్రమాణము బాసలు. వోరి నీ నాలుకకొయ్య.
నాగ:-ఇంత బోయబొంకులు బొంకిన నిన్నేమిచేయవలెనో నీవే చెప్పు
జయ:- హరి హరీ! పరమేశ్వరా! ఇదియేమి నీ చిత్రము.

కలితాంత వృత్తము

ఏ పాపము లేశము నే నెఱుగఁ
భోగ:- ఛీ! పో వగలిక్కడ చెల్లవురా
నాగ:- బాపండవ కీతని పాదహతిఁ
భూపాతము చేయుచు పొంగడగఁ
(పటపట పండ్లు కొఱికి కాలితో తన్నును)
సుమ:- (స్వగతము) అయ్యో! పరమేశ్వరా! ఎంత పాపికాలము వచ్చెను.
జయ:- సీ॥ దొంగలారా!
భోగ:- మేము దొంగలమా? కాము
నీవు దొంగవు దాచి లేదనుటను
జయ:- సర్వస్వమును గొని చనుఁడు
నాగ:- మీరానతి
యిచ్చెదరా మేము పుచ్చుకొనగ

(సుమతిని, జయదేవునిని పైపంచెలు లాగుకొని ధనమును రెండుమూటలు కట్టుదురు)
జయ:- ధనమెంత చెడ్డది
భోగ:- (హాస్యముగ) దానిని మేము కొం
పోయి యీ చెరుపిల్ల పొందెదముగ
జయ:- ఇది బండిలోనికి నేరీతి వచ్చె
భోగ:- నీ వేమియు నెఱుఁగవా యేల బొంక?
జయ:- తే॥ సత్య మెందున్నది హరీ
భోగ:- యిట్టి నిత్యమహస్సౌఖ్యవిద్యాలయము
నందటికి జెప్పి వంచించి యఖిలవైభవాలయుం
ధనముగొని చను నీకు సత్వంబు గలదె?

నాగ:- బ్రదికిపోవుదె మా చేతఁబడితి లోభి!

భోగ:- అన్నా! నాగయ్యా!

కం॥ మనమింత చేసి యీతని

వనమున నిట విడిచి చనిన, వడిఁజని వీఁడా

తనితోడ జెప్పు;

జయ:- చెప్పను.

నాగ:- చనఁజూచెదో? ప్రాణమిచ్చి, చనియెదు లేరా

ఈ నామాట వక్కటి వినరా అన్నా!

తే॥ మాయకాఁడుర వీఁడు దుర్మార్గుఁ డధిక

పాపి, లోభియౌ వీని నిప్పట్టునందు

విడువఁగూడదు మోసమౌ; వీనిఁబట్టి

చంపి భూమికి మేలు గావింపవలయు.

భోగ:-ఔరా తమ్ముడా! బాగా చెప్పితివిగాని. (భోగనాగులు, కత్తులు ఝుళిపించుచు జయదేవుని సమీపించి)

నాగ:- ప్రహాణ కలితా వృత్తము

తడయఁగఁ దగ దీతఁడు ధరఁ బడఁగన్

బుడబుడమని చప్పుడు బొడమగ నల్

గడలను బడి రక్తము ధర దొరుగన్

నడిమెడ నఱుకన్వలెఁ గడు వడిగన్

భోగ:- వేయి, వేయి. నఱుకు, నఱుకు. [ఇద్దఱు కత్తులెత్తుదురు]

సుమ:- హా!-హా!-హా! పరమేశ్వరా! ఎందున్నావు మహాప్రభూ! ఈ బ్రహ్మహత్య నేను కన్నులారఁ జూడవలసివచ్చెనా? నారాయణ! నారాయణ! [కన్నులు చేతులతో మూసికొనును]

జయ:- నాయనలారా! పుణ్యాత్ములారా! అవశ్యముగా మీ యిష్టమైనట్లే చేయుఁడు. ఏమియు నష్టములేదు. కానిండు. (మెడ యెత్తును)

(ప్రక్క పరదానుండి, నలుప్రక్కల హరి! హరీ! యను ప్రతిధ్వని వచ్చును)

భోగ:- ఓరి! తమ్ముడా! తాళు. తాళు.

నాగ:- ఏమిరా అన్నా!

భోగ:- ఇట్ల రారా. (ఇద్దఱు ముందుకుపోయి జయదేవుని చూపి) వరే! నరకపోతె నా మనసులో యేమొ గభిల్లు మనుచున్నది రా!

నాగ:- ఔనురా! ఆయన మొగంమూస్తే నాకు నఱకను చేతులాడ లేదురా. మెడ యెట్లు యెత్తినాడో చూడరా! ఐనా వీడు ప్రాణిలోకి పోకుండ వుండడమే కదా మనకు కావలసినది. వీని కాళ్ళు నఱికివేతాము.

భోగ:- చేతులతో పాకులాడుతు పోతేనో?

నాగ:- అట్లయితే, చేతులున్ను నఱికివేతాము.

భోగ:- అవును. అట్ల చేస్తిమి; మొండెము దోవలోవుంటే, నోరుంటాదిగదా! ఎవరైనా వచ్చి పొయ్యేవాళ్ళతో చెప్పితేనో?

నాగ:- దానికేమిరా! ఈ సమీపమున, అది గదిగో! నీళ్ళులేని యొక పాడుబావి వుంది. దానిలో వీని మొండెము పాఱవేసి పోదాము. అక్కడనే కుళ్ళి చస్తాడు.

భోగ:- ఒరే! మంచి యోచనగాడవురా, భళా! అట్లనే కానీరా.

సుమ:- (స్వగతము) అయ్యయో! చిత్రహింస చేయదలచినారే యీ పాపాత్ములు. ఓ స్వామీ! మీరు నిర్దోషులు గదా! తాము బాధపడుచుండ నేనెట్లు కన్నులార చూడగలను? అయ్యో! నేనెంత పాపాత్ముఁడను. నాకేల చావురాదు. శ్రీహరీ! (ప్రకాశముగ) అయ్యలారా! నన్ను మొదట చంపివేసి, తరువాత వారిని మీ యిష్టము మేరకు చేయుఁడు. నేనీ క్రూర కర్మమును చూడఁజాలను.

నాగ:- నీవు కోరుకున్నదే నీకును అవుతుందిలేర. కొంచెము ఓర్చుకో. తొందర పడకు. ఇదో కావచ్చినది. (భోగయ్యతో)

రారా అన్న త్వరగ. (జయదేవుని జూపి) పట్టుకో వీణ్ణి. ఈ బండ పై పండబెడుదాముర (జయదేవుని రెట్టలు యిద్దఱు పట్టుకొని) లేచి రారా పశువ! (అని యీడ్తురు. జయదేవుఁడు వారివెంట వచ్చును) ఇక్కడ యెల్లెలకల పండుకో. చేతులు కాళ్ళు చాపు. కదిలేవు జాగ్రత్త! (జయదేవుఁ డట్లు చేయును)

భోగ - మదన విలసిత వృత్తము.

నఱుకుము మనుజా

నఱుకుము తొడలకా (నఱుకును)

జయ - హా పరమేశ్వరా!

సుమ - హా మహానుభావా! భక్త రక్షకా! ఎక్కడున్నావురా స్వామీ? (మూర్ఛ వచ్చును)

నాగ - తఱి యిదె త్వరగా

నఱుకుము భుజముల్

జయ - హా! శ్రీహరీ! దీనదయాళో! (అప్పుడప్పు డనుచుండును)

నాగ - సెబాస్! అన్నయ్యా! బాగా చేస్తివి. ఈ చేతులు కాళ్లు విసరి ఆ ముండ్లకంపలో పారవేయి.

భోగ - (పారవేయును. వెనుక సుమతివద్ద చేరి) చూడరా! వీడు దొంగవేషము వేసుకొని చచ్చినట్లు పడినాడు.

నాగ - ఈడ్చు వీణ్ణి కాలుబట్టి. (ఈడ్తురు)

సుమ - (లేచి) హా! పరమేశ్వరా! ఈ బ్రాహ్మణునికి రావచ్చునా యీ దుర్గతి? అయ్యయో! (ఏడ్చును) స్వామీ! ఈయన మీకు పరమభక్తుఁడు కదా! వీరిమెడ నీ సంకల్ప మిప్పుడేల యిట్లైనది. నారాయణా! నేనిఁక నీతని జూడజాల. హరి హరీ! (కన్నులు మూసికొనును)

నాగ - వరే! ఇఁక నీగతి చూచుకోరా. ఏడ్చినావు. చాలింక నీ వగలమారి యేడ్పు. (భోగయ్యతో) వీణ్ణి పట్టుకోరా అన్నా.

సుమ - నన్ను చంపుతారా అయ్యా? (జయదేవుని జూపి) వారి పాదాలవద్ద చంపుడు. కానిండు. ముగింపుడు. (వంగును)

భోగ - తమ్ముడా! వీని నిక్కడ చంపరాదు. వరాల మూటలు శానా పెద్దవి. బరువుంఢును. నే నొకటి యెత్తికొని, వీని నెత్తిన యొకటి యెత్తి తీసుకపోతా వుంటాను. నీ వితని మొండెమును ఆ పాడు బావిలో పాఱవేసి, మాలో వచ్చి కలుసుకో. ఊరి ముందఱ పీణ్ణి ముగింతాము.

జయ - అయ్యో! పుణ్యాత్ములారా! సుమతిని మాత్రము చంపకుఁడు. వాఁడు నాకొఱకై వచ్చినవాఁడు. వానిని జంపుటకు మాఱుగ నా తల నఱికి వేయుఁడు. నే లేవఁజాలను. లేవఁగలిగియున్న వచ్చి మీ యిరువురి పాదములు పట్టుకొని ప్రార్థించియుందును. దయామయులారా! నాపైఁ గరుణించి వానిని విడువుఁడు. దయచేసి విడిచిపెట్టుఁడు. (సుమతితో) ఓ సుమతీ! నాయనా! నా కొఱకై వచ్చి నీకీ కష్టము వచ్చెగదా! ఆహా తండ్రీ! నేను నీ కేమియు సహాయము చేయలేనైతి గదా! శ్రీహరీ! పరాత్పరా! వీనిని- యీ సుమతిని- కాపాడుము. చోరులకు, భూతదయ గలిగించుము. రక్షించుము. కృప యుంచుము. ఆలించుము. పాలించుము. ఎంచుము. మన్నించుము. (మూర్ఛ)

నాగ -(భోగయ్యతో) వీని నూతలు, యీలాంటివి శానాయున్నవి. పద పదరా అన్నా! త్వర చేయుము. వరే! మఱియొకమాట. ఇటురమ్మా. వింధ్యదేశపురాజు సుదర్శనుఁడనువాడు తన మంత్రులతో కలిసి, యీ యడవిలో మునులను జూడ వచ్చినాడట. ఈ ప్రాంతమందే సంచారము చేయుచున్నాడట. అతడీ తట్టు వచ్చెనా, చుక్కెదురైనట్టు మన పని యగును. కాన, ముందుగనే తప్పించుకొని పోవలెను సుమా! నేనీ మొండెము నెత్తికొని బావిలో పడవేసి, మీతో కలుసుకొంటాను. వడిగాపదండి.

(నిష్క్రమింతురు. లోన గుభీలుమని ధ్వని వచ్చును)

జయ - (పరదా వెనుకభాగములో నుండి)

విద్యున్మాలా వృత్తము.

శ్రీకృష్ణా! రక్షింపం రారా!
నీకేలా యీ నిర్దాక్షిణ్యా
బీ కాఠిన్యం, బేలా వచ్చెన్
నీ కీ వేళా, నిత్యోదారా!

సీ॥ ఈ పాడుబావిలో నెంతకాలంబుందు
నీ దశయె యరణ్య రోదనంబు
పాడుదేహ మిదేమి పాపంబు మునుజేసె
పారెడి రక్త ప్రవాహ మకట
కాలుసేతులు గోయ నేల? యాపుణ్యాత్ము
లట్టె యీ గొంతు కోయంగ రాదె
ఇట్టి దుర్దశనొంది యీ బొంది పోవదే
ప్రారబ్ధ మనుభవింపంగ వలదె?

తే॥ గీ॥ హరి హరీ! యెట్టి దుర్దాన మందినదియొ
బాహుయుగ మహహా! తెగి పడియె ధరణి
పెద్దలను మున్ను తన్నెనో వినయ ముడిగి
కాళ్ళు మొదలంట తెగె నెంత కాలమయ్యె

ఉ॥ చీమలు కుట్టుచున్నయవి చిమ్మని చీకటి నూతి లోపలన్
పాములొ? తేళ్ళొ? మొండెమును పైకొని పాఱదొడంగె నక్కటా!
నా మొఱ నాలకింపఁ గరుణా జలధీ! దయరాదె నీకు; నే
నేమనువాఁడ మ్రొక్కుటకు నేనియు చేతులు లేవు శ్రీహరీ!

హా! ప్రాణనాయకీ! ప్రియభాషిణీ! పద్మావతీ! నీ వెట్టి కష్టస్థితిలో, నా హృదయమున మురిగి కలకబారిన మురికిగుంటలో, రాజహంస వొచ్చినట్లు, ప్రతిఫలించితివి. అయ్యో! అర్ధాంగి!

ఉ॥ హా! వనితాశిరోమణి మహామతి నీవు కడుం బ్రియంబుతో

జోవలదన్న నే వినకపోయిన పాపఫలంబు సేకుకాక
ని విఁక నెట్టులోర్తు వవనిక జనిపోయెను నీ ప్రియుం డనక;
దేవి! మహా పతివ్రతవు-దేహముఁ బాసెదవో క్షణంబునక.
హా! హతవిధీ! ఆ మనోహారిణి - ఆ కోమలాంగిని _ ఆ పతిదేవతా పరాయణను - ఆ మృదుభాషిణిని - నా కల్యాణిని -నిట్టి పరమ పాపాత్ముని కంటగట్టి, కట్టడివై విపత్పరంపరల, నా యువతీ మణిని, ముంపదగునా? హితమగునా? తగునా? తస్వీశిరోమణీ! ముదుసళ్ళగు నాతలిదండ్రులీ వార్తవిన్న నెంతటి వనటచే పొగిలి పోదురో! దిగులుపడి తమ జీవనమునం దాశ విడుతురో! కట కటా! అర్ధాంగీ! నా దేవతలగు తలిదండ్రులకు నా మాఱుగ నీవే యాతికర్త్రివై యుండుము. నన్ను దలంపకుము. సుకుమారీ! ఈ కఠినాత్ముని హృదయము నీబోటి సుందరులుండఁ దగినచోటు కాదు. వెడలిపొమ్ము. ప్రాణప్రియా! ఈ ద్రోహిని విడిచిపొమ్ము. తారేశముఖీ! ప్రియసఖీ!

ఆ॥ వె॥ గడియ లెంచుకొనుచు కాలంబు గడిపెద
వేగ రండటంచు వేడెఁగాదె
ఏమి కష్టపడుచు నేరీతి నున్నదో
దాని యిడుమ లెవరు దలఁచువారు

ఆహా! తప్పు బలికితిని. ఎవ్వరి ప్రారబ్ధకర్మము వారనుభవింతు రంతెకదా! ఇప్పటికి నాగతి యిట్లున్నది. క్రమముగ నీమొండె మున నెత్తురు కారి కారి బలహీన మగుచున్నది. కన్నులు మూత పడుచున్నవి. ఇఁక నిది ప్రాణ ప్రయాణ సమయము కాఁబోలు! ఇట్టి విపత్సమయమునఁ గదా ధైర్య మవలంబించ వలయు. సుఖ దుఃఖములకుఁ గారణము శరీర ధారణము. ఇది సుఖమును, దుఃఖమును కావలసినంత భుజించినది. భుజించు చున్నది. ఇందు నేనున్నానను స్పృహచే నిది నాయం దద్యత్వ

మైనది. దానివలన, నీ సంసారమెల్లను వచ్చినది. దానితోటి పొత్తు చాలుంజాలు. అది యెట్లయినను పోని. ఇఁక నే నంతర్లక్ష్య విధానమున సూక్ష్మాంగముం జాలించి, కారణముం నిరాకరించి, మహాకారణాం బతిక్రమించి, సర్వ వికల్పవిరమణ మొనర్చి యూరకుండెద.

మత్తకోకిల.

మాయనిద్రను దోచు స్వప్నము మాత్రమే జగమంతయుఁ
హేయమైనది దీని నమ్మంగ నెంతమాత్రము బోలదీ
కాయమట్టిదె కాన, మేల్కొని శాంతు నేను విశోకమై
ధ్యేయమైన పదంబు నిర్మల ధీరమానస గమ్యముఁ

(పరదా ముందుభాగమున సుదర్శనరాజు, నతని మంత్రి, భటులు, మేనా మాలుగు ధ్వనితో వచ్చి మేనా దింపుదురు)

రాజు - (ప్రవేశించి) సచివోత్తమా!

మంత్రి - చిత్తము! సుదర్శన మహాప్రభూ!

రాజు -మనము మన వింధ్యదేశమునుండి ఋషుల దర్శనము చేయుచు కడుదూర మరుదెంచితిమి. అమ్మహాత్ముల యాశ్రమము లెంత రమ్యములు. మన మేడలు, సౌధంబులేల వాని ముందఱ. ఆశ్రమము ప్రవేశింపగనే చిత్తమెంత నిర్మలమగుచుండును. ఎట్టి నిష్కల్మషమగు వైరాగ్యమును రుచి జూచితిమి. ఔరా! లోకమే మఱచితిమి.

మంత్రి - అది యా తపోధనుల మహిమ. వారు శాంతమూర్తులు. రాగాది కల్మష విదూరులు. సత్యవ్రతులు. కావుననే వారి సన్నిధి నతిశాంతమై యందుండు సర్వభూతములు, పరమశాంతినే పొందియున్నవి. నిసర్గ క్రూరములగు మృగేంద్రాదులు సహితము జాతి వైరము పాటింపక పరమ సాధువులై యున్నవి.

రాజు:- ఇట్టి వీరి సన్నిధిం బొందిన మన మెంత ధన్యులము. ఇట్టి యాశ్రమముల విడిచి రాజాలక గదా కాళ్ళు ముందుకు మనస్సు వెనుకకు లాగుచుండుటం జేసి, ప్రయాణము విరివిగా జరుగక యీ నట్టడవిని పొద్దు గ్రుంకుటచే నే డిచటనే నిలువవలసి వచ్చినది. మంచిది. మంత్రీ! మన మందఱు మిందే విశ్రమింతము. రేప కడ వెడలిపోదము.

మం:- చిత్తము ప్రభూ! చూడుండీ యరణ్య మెంత దట్టముగానున్నది. ఆహా! ఇందనేక వన్య మృగములు సంచరించుచుండును. ఇది వాని సంచార వేళ. అదిగో! అప్పుడే పుండరీకముల ధ్వాన ములు వినవచ్చుచున్నవి. మనమీ కొండమోటున విడిది గావించి రాత్రియంతయు హెచ్చరికగా మెలగుచుందము. నాల్గు జాము లును వరుస మేరకు నొక్కరొక్కరుగా మేల్కొని యుందము. (అందఱు కొండమోటున విడిదిచేసి రాజునకు ఒక బండపై విడిది చేయుదురు).

జయ:- (పరదా వెనుకనుండి) మత్తకోకిల.

న్యాయకోట్ల నెఱుంగరానిది స్వానుభవ వేద్యంబునై

రాజు:- (ఆలకించి) ఓహో! ఏమిది! ఈ సంధ్యావేళ నీ యరణ్యమున నెవ్వఁడో పాడుచున్నాఁడు. మరల ఆలకింతము.

జయ:- మాయ చీఁకటినెల్ల నొక్కట మాపఁగా రవి బింబమై

రాజు:- ఆహా! బ్రహ్మజ్ఞానివలె నున్నాఁడే.

జయ:- ఏ యుపాధియు లేక నిర్మల మేకరూపము శాంతమై

రాజు:- ఔరౌర! ఎంత సుఖముగ నున్నది.

జయ:- ధ్యేయమా పరమాత్మగా నయితిం సుఖంబుగ నుండెదన్.

రాజు:- సరి! అతఁడెవఁడో మహర్షి. అన్యుని నోట, నీ యమృతధార వంటి వచోధోరణిగల దివ్య పద్య మెట్లువచ్చు. మంచిది. సచివ చంద్ర! మన మిప్పుడే వెళ్లి యమ్మహాత్ముని దర్శనము చేసికొని

వత్తమురా! జాగైన వారు వెళ్లి పోదురేమో? ఆనంద రస సముద్రములోని యలలవలె వారి నోట వచ్చిన మాటలే యిట్లుండ నింక వారి దర్శనమున మనము ధన్యులమే కామా? పద పద.

మంత్రి:- మంచిది పదండి. ధ్వనివచ్చిన జాడ యిటు. ఇలాగున రండు. (అందఱు కొంత నడచి) ఏమక్కడ? ఆ వెలుతురు! చంద్రోదయమైనట్లు లున్నది.

రాజు:- నిదానించి చూతము. (ఇద్దఱు భటులు చూచి)

మంత్రి:- బావి! బావి! ముందు పోకుఁడు.

రాజు:- (తొంగిచూచి) ఏమి యీ చిత్రము.

ఉ॥ పున్నమనాటి వెన్నెలను బోవకయుండఁగఁబట్టి బ్రహ్మ యీ
పున్నెపు కానలోని ఋషిపుంగవులెల్లను కుండికాతతిన్
గ్రన్నన ముంచుకో ననువుగా నిటఁ గూపము నిండబోసినా
డన్న తెలుంగునం బొలుచు నౌర! మహాప్రభ చూడు బావిలోన్

మంత్రి:- రాజేంద్రా! ఇదేమి చిత్రము. లోకమున నిట్టి వెందైన వింటిమా! చూతమన్న, నా కాంతికి కన్నులు మూసికొని పోవుచున్నవి.

రాజు:- ఎట్లయినన్ జూడవలయు. (బావిలో తొంగిచూచి) ఆహా! బావి యడుగున నేమో యున్నది.

మంత్రి:- నేనుం జూచెద. (చూచును)

సీ॥ మానవాకృతి యందమా? లేవు కాల్సేతు
లది కాదన నరాస్య మదె వెలుంగు
నరదేహ మందమా? నలువైన యీ దివ్య
తేజంబు దానికే యోజ గలుగు

రాజు:- దేవ దేహంబొకో?

మంత్రి:- దీనత్వమున పాడు
నూతఁ గాల్సేతుల కోతలెట్లు

రాజు:- యిట్టి వ్యక్తులు బ్రహ్మసృష్టియం దున్నవే

మంత్రి:- కాదు. గాయములు రక్తమును [illegible]

గీ॥ కాన నితఁ డెవ్వఁడో మహా ఘనుఁ[illegible]రుఁడు
దివ్య తేజుఁడు కర్మంబు దివియ నిం[illegible]
నెట్టులోవచ్చి పడియుండు, నిది నిజంబు;

రాజు:- మఱికి నీతనిఁ దీయ సర్వంబు తెలి[illegible]

మంత్రి:- తీయింతము. (భటులతో) ఓరి! భటులారా! మీ[illegible]
హస్తములు చేబూని, యీ నూతిలోనికిం దిగి, [illegible]ను
తాళ్ళకుగట్టి జాగ్రత్తగా పైకి దీసి, యొడ్డున నుంచుడు.

భటు:- చిత్తము మహాప్రభూ! అట్లనే చేయుదుము.

(జయదేవుని నొడ్డునఁ దెచ్చి యుంతురు. సుదర్శనుఁడు జయదేవుని తాకి సంతోషముచె)

రాజు:-

ఉ॥ ఓ సచివేంద్ర! దేహమున నున్నది యుష్ణగుణంబు;
(ముక్కు దగ్గఱ చేతినుంచి) లేదహా! శ్వాసము (దీనుఁడగును)

మంత్రి:-
చింతనొందకు ప్రశాంతిని బ్రహ్మమునన్ సమాధి నా
యాసము బాసియున్న నటులౌట స్వభావమె;

రాజు:- పల్కరింతమా?

మంత్రి:-
మోసమగుం నిదానముగ బోధితుఁ జేతము రాజసత్తమా!

[మంత్రియు, రాజును వీవనలబూని జయదేవుని దేహముపై విసురుచుందురు.]

మంత్రి:- రాజేంద్రా!

చం॥ చిఱునగ వంకురించు ముఖ చిహ్నము చూడు మితండు దుఃఖమే
డ్తెఱ డిగద్రోచి చిచ్చుకరణి న్మతి జొన్పినవాఁడు లెస్సగా
తఱిగిన కాలుసేతులను దా మదిఁ గుందక యేడ్వకుండ నే
తెఱగున శాంతినొందె నతిధీరులు బ్రహ్మవిదుల్ ధరాతలిన్

రాజు:- ఇంక తిన్నగ హెచ్చరింతమా?

మంత్రి:- చిత్తము! అటులనె గావింతము. (జయదేవుని జూచి)

రాజు:-

కం॥ స్వామీ!

మంత్రి:- మహానుభావా!

మామీదం గరుణయుంచి మాటాడ గదే

రాజు:- తామరలంబోలు కన్నులం

బ్రేమంబున దెఱచి చూడవే శాంతాత్మా!

జయ:- (తిన్నగ కన్నులు తెఱచి స్వగతము) ఏమిది? బావిలోనుండి యీ దేహము బయటి కెట్లు వచ్చినది?

ఆ॥ వె॥ తనువుతోడి వెతల దగులంబు రోసి ని
రంతరాత్మ సుఖము నందుచున్న
నన్ను బిలిచి మరల జ్ఞప్తి చేసినయట్టి
మీర లెవరు? ప్రేమమీర జెపుడి.

మంత్రి:- మహాపురుషా! ఈ మహాపరాధ మొనర్చిన పాపాత్ములము మేము. (రాజును చూపి)

ఆ॥ వె॥ ఇతఁడు వింధ్యదేశ మేలెడు రాజు, నే
నితని మంత్రి, నేము ఋషులఁ గొల్వ
నివ్వనంబు జొచ్చి యిట నిల్చి మిముఁగాంచి
యెత్తి యుంచినాము, బత్తి యొదవ.

రాజు:- స్వామీ! తమ సమాధికి విఘ్న మొదవఁ జేసిన పాపము మాకు రాకుండ ననుగ్రహింప వలయును. (ఇద్దఱు నమస్కరింతురు)

జయ:- పుణ్యాత్ములారా! మీకు శుభంబగు.

మంత్రి:- మునివరా! ఒక విన్నపము మన్నించి యాలకింపవలయు.

ఉ॥ ఎవ్వరుమీర లివ్వనికి నేటికి వచ్చితిరయ్య దుష్టులా
నెవ్వరు మీ మహావ్యథకు హేతువులైరి మహాత్మ! చెప్పవే?

రాజు:- నెవ్వాగబుట్టి మా మనము నీరయిపోయెడి మిమ్ము జూచినన్
దెవ్వాగనేతు మాఖలుల దేహములం గడికండలై పడన్.
జయ:- హరి హరీ! వలదయ్యా వలదు.

చ॥ పురుషుఁడు తొంటికర్మముల బుట్టు ఫలంబు భుజింప దేహముల్
వరున ననేకము ల్వడయు వాని నెవండని చెప్ప వచ్చునే
సరణిని గర్మమీడ్చిన వెసంజను నాతఁడు దానివెంట నె
వ్వరు సుఖ దుఃఖ హేతువులు వానికి కర్మమె గాక ధారుణిన్

రాజు:- సత్యమే తాము సెలవిచ్చినది. ఇంతటి మహాత్ములగు తమ
కీ యపకార మొనర్చిన బ్రహ్మద్రోహులం బేర్కొనుఁడు.
దేవా! అట్టివారి కొఱకే గదా నేనీ ఖడ్గము ధరించియుండుట.
జయ:- ధర్మాత్మా! పుణ్యపురుషా!
చం॥ సకల చరాచరాత్మక విశాల మహా భువనంబు లేమహా
త్మకుని కటాక్షలేశమున తాను జనించి వసించి నాశమౌ
నకలుషుఁ డట్టి యీశ్వరుని యాజ్ఞయె గాకొకరుం డొసంగునే
యొకనికి దుఃఖముం సుఖము నొప్పునె యొక్కని నిందసేయగన్

మంత్రి:- రాజేంద్రా! వీరు మహనీయులు. వీరికి తమ కపకార
మొనర్చినవారిపేర్లు సయితము చెప్ప నిచ్చ లేదు. ఐనను చూతము.
సంయమీంద్ర! శాంతనిధీ! (రాజును జూపి)
తే॥ గీ॥ క్షత్రియుఁ డితండు దుష్టుల శాస్తిసేయు
పని యితనిదౌట మీకిట్లు బాధచేసి
నట్టి దుష్టుల శిక్షింప నర్హ వేఁడు;
వారిఁ బేర్కొన దయసేయవలయు ననఘ!
జయ:- ధర్మాత్ములారా! విజ్ఞులారా! వినుఁడు.
ఉ॥ ఏనును నీవు నిద్ది యను నీయవి మాయనుగల్గు భేదముల్
గానగవచ్చు మాయగల కాలమునందలి నిర్వికల్పమౌ

జ్ఞానము గల్గినం సమయు సర్వమునంతట జ్ఞాత జ్ఞేయముం
జ్ఞానమునుండ నేకమగు సత్త్రైకటే వెలుగొందు నిత్యమై
తే॥ గీ॥ ఎఱుగుమో మంత్రివర్య! నే నెఱుంగ నెదియు;
నాకు కాల్సేతు లెన్నటున్నవి? స్వభావ
మునసె యవయవ రహితుండ; భోగ్యభోగ
భోక్తృతా శూన్యుఁడను సుఖమూర్తి ననఘ!

(అని యూరకుండును)

మంత్రి:- రాజచంద్రా! వింటివా? వీరు మహానుభావులు. నిత్య నిర్వికల్ప సమాధియం దుండువారు. వీరు భేదదృష్టి లవమాత్రి మెఱుంగరు. మన మెంతగా నడిగినను నిష్ప్రయోజనము. చెప్పరు. వీరి వాగమృతధారలను తనివిదీర వీనుల విందుగా వింటిరి గదా! అమృతరసము స్రవించు నుపనిషదర్థము లివి. వీరో! బ్రహ్మానంద నిధులు. వీరి స్థితియో బ్రహ్మాదులకు లభ్యము. మన పూర్వపుణ్య పరిపాక విశేషమున, వీరి దర్శనము మనకు లభించినది. ఇమ్మహాత్మునకు నుపచరించు ప్రాప్తి లభించెనా, మనము నిస్సంశయముగా కృతార్థుల మగుదుము.

రాజు:- ఔనౌను! సచివోత్తమా! మనము వెనుకటి దినమున, మహర్షుల దర్శనమును చేసికొన్న ఫల మిప్పుడె మన కీ రూప మున తటస్థించినది. ఆహా! మన పుణ్య మగణ్యమగుట చేతనే, నిష్కాములగు నీ మహనీయుల కుపచారము చేయగల యవ కాశమును మనకు లభ్యమైనది. ఈ జ్ఞాన నిధిని, యీ శాంత శమదమాది సద్గుణోపేతుని ప్రార్థించి జోహారులు గావించి, మన పురికిం దోడుకొని పోగలిగితిమా నేడు మనకు బ్రహ్మానంద నిక్షేప మవలీలగ, నతి సులభముగ ప్రాప్తించినట్లై మనము నిజముగ, కృతార్థుల మగుదుము. ఇందుకు నీ వేమందువు?

మంత్రి:- మంచి దట్లే చేయుదము. (ఇరువురు చేతులు జోడించి)

ఋషి కులోత్తమ! ఇంచుక మా మనవి యొకటి మన్నించి యంగీ
కరింపవలయు.

ఆ॥ వె॥ జ్ఞాన మొందగోరి కడగండ్ల బడి పడి
కడకు మిమ్ము గాంచ గంటి మనఘ!

రాజు:- మమ్ము కరుణజూచి మా పురంబునకు వి
చ్చేసి మమ్ము బ్రోవ జిత్తగింపు.

జయ:- (యోచించి స్వగతము)

కం॥ ఇదియేమి హేతువో? నె
మ్మది నింతటనైన విడకు మహితబలము సు
మ్మది కర్మము సంసర్గము
బాదవించినదీ ప్రియాస మూఱడదింక౯

(ప్రకాశముగ) వలదని నేనేమి చేయగలను? అవశ్యముగ మీాయిచ్ఛ
వచ్చినట్లు చేయుఁడయ్యా.

రాజు:- (సంతోషమున భటులతో) భటులారా! ఇపుడే మా పాల
కిలో వీరిని మెల్లగా పరుండజేసి, అతి జాగ్రత్తగా మన పట్టణం
బునకుఁ గొని పోవలయును సుమీా!

భటు:- చిత్తము మహాప్రభూ! (జయదేవుని నెత్తబోవుచు) రాజు
గారి పుణ్యాన, నీ స్వాములను ముట్టి మనమును కృతార్థుల
మైతిమి. (జయదేవుని పల్లకిలో నుంతురు)

రాజు:-అమాత్యవరా! మనమిక స్వామిగారి పాలకి వెంటనంటి పాద
చారులమై పోవుదము. ఎందుకన వీరి సన్నిధానమున మనము
వాహనములెక్క నర్హులము కాము.

మంత్రి:- మిక్కిలి చక్కగా వచించితిరి. మీా వినయ వివేకము
లెంతయు బాగడ తగినవి. అట్లే చేయుదము.

[అందఱు నిష్క్రమింతురు]



3 వ అంకము. 1 వ రంగము.

జయదేవుని మందిరము.

[జయదేవుఁడు మంచముపైన కూర్చుండి యుండును]

జయ:- ప్రారబ్ధకర్మ మెట్లీడ్చినం బోవుచుండవలయు. ప్రయత్న మేమియుం దానికి వ్యతిరేకించి పని చేయఁజాలదు. లోకమున నజ్ఞానులు తమ ప్రయత్నములు కర్మానుగుణములై ఫలించినచో తమ ప్రయత్నము ఫలించెనని యుబ్బుదురు. అవి కర్మప్రవాహ విరుద్ధములై ఫలింపనిచో వగతురు. యథార్థముగా విమర్శించినచో పురుష ప్రయత్నమే కర్మాధీనము. అదే సంకల్పమును. కావున నెట్టి ప్రయత్నమును జేయనివాఁడే నిస్సంగుఁడు. వాఁడే యోగి. వాఁడే జీవన్ముక్తుఁడు.

రాజు:- (ప్రవేశించి) స్వామీ! నమస్కరించెదను.

జయ:- రాజా! నీ కనామయ మగుగాక! ఇప్పుడు నీ యోగస్థితి యేలాగున నున్నది చెప్పుము.

రాజు:- స్వామీ! తాము నాకు ననుగ్రహించిన మార్గము కడుం గడుఁ జక్కనిది. మిగుల సుఖకరమైనది. ఆవరణ విక్షేపముల స్వరూపము దానిచే నాకుఁ దెల్లంబయ్యె. లోకమున నావరణ నివృత్తి చేసికొనకయే విక్షేపమును నివారింపఁ బ్రయత్నించు వెఱ్ఱులం జూడ నాకుఁ గరుణ బుట్టుచుండు. నేను దానిచే నొకానొకప్పుడు ప్రజలందఱును గృతార్థులగు నుపాయ మేదేని నుండునా యని యోజింతు. అప్పుడు శ్రేయోమార్గము లధికారి యోగ్యతానుసారముగఁ బెక్కు లుండునని తాము సెల విచ్చినది నాకు జ్ఞప్తికి వచ్చుటచేత, నిప్పుడు మిమ్ము నీ విషయమై ప్రార్థింప నుద్దేశించితి. దయచేసి విన వేఁడెద. దేవా! అధికార భేదము నపేక్షింపకయే యందఱికి సుసాధ్యమై, సులభమై,

శ్రేయస్కరమగు నుపాయ మేదేని నుండునా? అట్లున్న దయచేసి సెలవిచ్చి నా సంశయము నివారింపుఁడు.

జయః- రాజా! మంచి ప్రశ్న యడిగితివి. ఇది ప్రజా పాలకుఁడవు, సుబుద్ధివియు నగు నీవవశ్య మెఱుఁగవలసినదే. చెప్పెద వినుము. భూమిశా! లోకమున నుత్తములని, మధ్యములని, సామాన్యులనియు, నధికారులు ముత్తెఱంగులుగ నుందురు. అందు నీకు మేము చెప్పినది యుత్తమాధికారుల తెరువు. మధ్యమాధికారుల త్రోవ, యమ నియమాదుల సాధన. ఇఁక సామాన్యాధికారులకై యుద్దేశింపఁ బడినవి, తీర్థయాత్రలు - దేవపూజలును. వీని కధికార విభేద మక్కఱలేదు.

రాజుః- నిజమే గాని, అవి నిర్ధనులకును, బలహీనులకును నెట్లు సాధ్యములగును స్వామీ?

జయః- కావుననే పెద్ద లిట్లు చెప్పిరి.

శ్లో॥ నహ్యమ్మయాని తీర్థాని నదేవా మృచ్ఛిలా మయాః ।
తే పున న్త్యురుకాలేనా దర్శనా దేవ సాధవః ॥

అనగా,

మ॥ జలరూపంబులు గావు తీర్థములు పాషాణంబులు న్మన్ను వే
ల్పులు గావవ్వి కొలల్ హరించుటకు జెల్లుఁగా బెద్దకాలంబు వే
ల్పుల తీర్థంబుల రూపు సాధుజను లో భూపాలకోత్తంస! వా
రల దర్శించిన తత్క్షణంబ క్షయమౌ రాశీకృతాఘౌఘముల్.

కాబట్టి, యట్టి సాధువుల సభక్తికంబుగా దర్శించి, భావించి సేవించిన ఫలం బనాయాసమ్ముగా నెట్టి ధనహీనునికైనను లభించు. అట్టి సత్పురుషుల సాంగత్యంబున సాధింపరాని దేమి యున్నది.

మత్తకోకిల.

సాధుసంగతి చేతగల్గు నసంగ భావము నందుచే
బోధ గప్పుచునుండు మోహము బోవుదా మొదలంటఁగా

గాధలేల విమోహ మొంగినం గల్గు నిశ్చలభావ మీ
సాధనంబది దేహముక్తికి సాధనంబగు భూపతీ!

కావున నో రాజేంద్రా! సత్సాంగత్యము సర్వ శ్రేయోమూలము.

రాజు:- స్వామీ! ఎట్టి సదుపాయముం జూపితిరి. ఆహా! యెంతటి చక్కని మార్గమును బ్రదర్శించితిరి. ఇది నా కనుభవమయియే యుండియు, నే నూహింపలేనైతి. తమ సమాగమముచేత నే కదా నేం గృతార్థుండనైతిని. ఈ మార్గమే నా రాజ్యములోని జనులెల్ల రభ్యసింప నాజ్ఞాపించెద. నేనును సాధు సత్కార మొనర్చుచు, వారికి విడుదుల నేర్పరించెద. రాజెట్లుండు జను లట్లుందురు. ఇట్లు నేను చేయుచున్నచో జనులెల్ల రిట్లే చేసి కృతార్థులగుటయే యందుల కగు ఫలము. (లోన గంట మ్రోంగును) అదిగో! గంట మ్రోంగుచున్నది. ఉపాసన గావించి సభకు వెళ్లుదము.

(రాజు నిష్క్రమించును)



**3 వ అంకము.** **2 వ రంగము.**

సుదర్శనుని సభ.

(మంత్రి, సేవకులు)

రాజు:- మంత్రీ! జనకచక్రవర్తి విదేహుండై, రాజ్యము సేయుచుండె నని విని, ఇది పొసంగుట దుర్ఘట మనుకొనుచుంటిని. ఇప్పు డది శ్రీ గురుస్వాములవారి కటాక్షముచే మహా సుఖముగ, నతి సులభముగ నా కనుభవమునకు వచ్చినది.

స్రగ్విణి॥ రాజ్యచక్రంబె సంభ్రాంతమై యుండ నే
పూజ్యతం జెంది తన్మూలముం జేరితిం

త్యాజ్యతా గ్రాహ్యతా వ్యత్యయా తీతమా
పూజ్య సామ్రాజ్యముం బొందితిం నిస్పృహా౯.

మంత్రి:- రాజేంద్రా! తామిట్లు ధర్మ స్వరూపులయి రాజ్యమును శాసించుచుండ సమస్త భూతజాలము, నిరస్తదుఃఖమై యానందించు చున్నది. ధర్మము కృతయుగంబున౯ వలె నడచుచున్నది. శత్రువులు లేనే లేరు. సర్వ జనులును, సాధు సత్కార పరాయణులు. స్వధర్మ నిరతులు. కాలమెఱిఁగి పర్జన్యుండు వర్షించుచుండు. దాన సస్యం బపూర్వ పుష్కల ఫలం బిచ్చుచున్నది. అందఱకును పట్టినదెల్లనుం బంగారమై, పట్టణం బంతయు నిత్యోత్సవ, పచ్చతోరణమై, ప్రజాభివృద్ధి నలరారుచున్నది. తమ వృత్తిచే తమకు రాజర్షి యను కీర్తి దిగంత విశ్రాంతమైయున్నది. తమ సాధు సత్కారశాలలు దేశమెల్ల నెగడినవి. అన్య రాజన్యులు నిట్లే ధర్మమొనర్చు చున్నారని, చారులవలన వార్త వినవచ్చెడిని.

రాజు:- ఇది నాకుఁ గడుంగడు నింపైన వర్తమానము. ఇఁక మన మాలోచింపవలసిన రాజకార్యము లేమియు లేవుగదా? శ్రీ గురుస్వాములవారి దర్శనమునకు వెళ్లుటకు వేళయైనది.

భటు:- శ్రీ సుదర్శన మహారాజుంగారికి జయమగు గాక.

రాజు:- ఏమది సేవకా?

భటు:-స్వామీ! గురుస్వాముల పరిచారకుఁడు శ్రీవారిచేఁ బంపఁబడి, హజారమున వేచియున్నాఁడు.

రాజు:- తోడితెమ్ము.

భటు:- చిత్తము. (నిష్క్రమించి, మరల చారునితోఁ బ్రవేశించి)

పరి:- (స్వగతము) మా రాజుగారు సాధువులకు బహుమాన మిచ్చు చున్నారను కీర్తి దిక్కులఁ బిక్కటిల్లినది. ప్రజలెల్లరు సాధువులుగా మారినారు. రాజుగారి యీవియు నట్టిదే. ఇచ్చు

కొలఁదిని, బొక్కసమున ద్రవ్యము నెడతెగక పెరుగుచున్నది. ఏమి యీ వింత. (ప్రకాశముగ) మహాప్రభూ! దండములు. (నమస్కరించును) శ్రీ దేశికేంద్రుల సన్నిధికి, నిరువురు సాధువు లిప్పుడే వేంచేసియున్నారు. వారిని జూచినప్పటి నుండియు, గురుస్వాములవారికి మహానందము గలిగినది. మిమ్ము వారి సన్నిధికిఁ గొనిపోవుటకే వచ్చితిని.

రాజు:- ఓహో! నేఁడెంత సుదినము. స్వాములవారికడ కేను పిలిపింపఁబడి పోయెదను. ఆ విజయము చేసియుండు సాధువు లెంతటి మహనీయులో! త్వరగా వెళ్లి దర్శించెద. మంత్రీ! పోయి వచ్చెద. (అందఱు లేతురు)

భటు:- కచేరీ బరకాస్తు. (పరదా పడును)



3 వ అంకము. 3 వ రంగము.

(మంచముపై జయదేవుఁడు, సాధువేషధారులగు భోగ, నాగదాసులు, పరిచారకుఁడు)

భోగ:- (నాగ-తో) మనము దోఁచుకొని పోయిన ద్రవ్య మంతయు నాటలకని, కల్లుకని, సారాయికని, గంజాయికని, సరిపోయె. సెట్టి దగ్గఱ కొలువు చాలించుకొంటిమి. సెట్టి యింకా మనలను వెదికిస్తూనే యున్నాఁడు. దేశాంతరాలు చేరితిమి. ఈ దేశము బాగా యున్నదని యిక్కడికి వస్తిమి సాధువులకు యీ రాజు బహు ధనములు ఇస్తాడని విని.

నాగ:- ఔపోరా! నీవే గదా యిక్కడికి పిలుచుకొని వచ్చినది. రాజు దగ్గఱకే పోయివుంటే ఆయన యిచ్చిన మట్టుకే తీసుకొని పోయియుందుము. ఆశ దోస మెఱుఁగదు.

భోగ:- సరేరా! మనము కాళ్ళు చేతులు నఱికి పాఱవేసిన యీ బాపడు ఇంకా బ్రదికి వుంటాడనిగాని, వీడింత దూర దేశానికి వచ్చి యుంటాడనిగాని, నేనేమి కల గంటినా? గురువు చెప్పితే రాజు ఇంకా చాలా ధనము యిస్తాడని లోకులనుకొంటూ యుంటే, గురువంటే యెవరో అని వస్తిమి. ఇఁక యేమి గతి? దైవము మనవంటి పెద్దపులుల నీ బోనులో దోసె. ఆహా!

రథోత్తర వృత్తము

భోగ:- మోసపోయి యిటముందు మించి పే
రాసవచ్చితిమ-హా యిక్కెట్లురా

నాగ:- ఇంకేమి, వీడును మనలను మిగుల
దోసకారులని-దోచియేకద దాసునంపెనిక-దాగుటెట్లురా .

రాజున్ను వచ్చుచుండును. మనము దాఁగుటెట్లు? ఈతఁడు మనచేత, అపు డంతహింస పడినవాఁడు, యిప్పుడు రాజుకే గురువై యున్నాఁడు. మనమూ దైవాధీనముగ, యిక్కడికే వచ్చి చిక్కితిమి. ఇప్పుడు విడుచునా? విడువఁడు, విడఁవఁడు. పగదీర్చుకొనక మానఁడు. అయ్యో! మన కేమిగతి?

భోగ:- నా కేమియు దోచదు. దేహామంతా చెమర్చుచు వణకు పట్టినది. మాటలూ తడబడుచున్నవి.

నాగ:- నాగతి అంతే అయినది. యేమి చేతామన్నా? ఆటలాడే పిల్లలమధ్య అయ్యవారు కనిపించి నట్లైంది. వాఁడు చూఁడు. ఎట్లా మనలను చూస్తూన్నాఁడో?

భోగ:- ఆతని మొగము చూడడానికి నాకు సిగ్గగుచున్నది. నేనేమి చేయుదు. మనకు నిజముగా నేఁడే చావు మూడినది. (ఒకరి వెనుక నొకరు ఒదుగుదురు)

[రాజు ప్రవేశము]

రాజు:- స్వామీ! నమస్కారము. (నమస్కరించును.)

జయ:- వత్సా! సుఖివగుము. కూర్చుండుము.

రాజు:- (కూర్చుండును)

జయ:- నేఁడెంత సుదినము రాజా!

భో-గ:- (నాగయ్యతో) మనము చిక్కితిమని నేఁడు సుదినమని యితఁడు చెప్పుచున్నాఁడు చూడరా

రాజు:- నే నటులే తలంచితిని. దేవరవారి పరిచారకుఁడు తమ సన్నిధికి మహాసాధువు లెవ్వరో యిద్దఱు వచ్చియున్నారని చెప్పి యున్నాఁడు. వారేరీ?

భో-గ:- అట్లు చెప్పిపంపి తేనే గాని రాజు రాఁడని యీబాపఁడు యీ మాయచేసినాఁడు చూచినావా ?

జయ:- ఆ ప్రక్కన యున్నారు చూడుము. వారు ప్రహ్లాదాది పరమ భాగవతోత్తములతో సరివచ్చు మహా పుణ్యాత్ములు.

భో-గ:- (నాగయ్యతో) చూడు వాని మొగతాళి.

నాగ:- (భో-తో) అప్పుడే నీనితల నఱికివేసి పోయియుంటే మనకీ విపత్తు రాకుండునుగదా ? అన్నా ! శత్రుశేష ప్రభావమిది. కానికాని (అని పండ్లు కొఱుకును.)

జయ:- రాజా ! అవహితుఁడవై వినుము.

భో-గ:- ఇఁక చెప్పుచున్నాఁడేమి గతిరా ?

జయ:-

ఉ॥ ఎందఱు సాధులం గొలిచి యెందఱు యోగుల సత్కరించితో
యొందఱు సత్తపోధనుల కిచ్చతెఱింగి సపర్య లిచ్చితో
యొందఱుఁ బూజచేసితివొ యెందఱ జూచితొ భక్తి మ్రొక్కితో
యందఱు నొక్క యెత్తు విమలాత్ములు వీరలు నొక్క యెత్తహో!

రాజు:-అట్లైన వీరి దర్శనము చేసికొనెద. (ముందుకువచ్చి) మహాత్ములారా! నమస్కరించెద.

భో-గ-నాగ (తలవంచుకొని యుందురు.)

సుద:- (జయదేవునితో) స్వామీ! వారు నావైపు చూడలేదు. నా నమస్కార మంగీకరింపలేదు. ఇది యేమి.

జయ:- వారు నిత్యసమాధి నిష్ఠులు. అంతర్ముఖులు. కావున నీవంక చూడరు. ఇఁక నీవు నమస్కరించినది వారికెట్లు తెలియును?

భోగ:-(నాగ-తో) కొటికివేసి కొనయూపిరితో నుండు యెలుకలతో పిల్లి చెల్లాటమాడునట్లు, మనతో నితడు చెల్లాటమాడుచున్నాడు చిక్కితి మేమిచేయగలము.

రాజు:- మఱి వారి నే నెట్లు పూజింతును?

జయ:- వారిం బిలిచికొని పోయి వారికొక మందిరమున బసచేయించి తగిన పరిచారకుల నేమరక జాగ్రత్తగ సేవింప నంపుచుండుము.

భోగ:- (నాగతో) సరి! ఇక మనలను కారాగృహములో నుంచి సిపాయీలను కాపుదల యుంచమని గుప్తముగా చెప్పుచున్నాడు చూచితివటరా? ఇక యింతే మన గతి. కాని, ఆయన పుణ్యాన మనలను తుండ్లు తుండ్లుగా నఱికించమని చెప్పలేదు.

రాజు:- మహానుభావులారా! నా మనవి దయచేసి వినవలయు, మద్గృహమున కొన్నినాళ్లు తాముండి నన్ను ధన్యునిగా జేయవలయు. ఇది నా ప్రార్థన.

భోగ-నాగ- (ఇరువురు తలవంచి యూరకుందురు.)

రాజు:- స్వామీ! వారు నా ప్రక్క కన్నెత్తి చూడరే

జయ - రాజా! వారి వృత్తి, విషయ విముఖము. కావున నీ వైపు చూడరు. ఐన నేమి?

తే॥ గీ॥ వారి నాకన్న హెచ్చుగా గారవించు
వారి సము లెందుఁ జూచిన లేరెఱుంగు
వారి మతికెక్క భక్తిఁ గొల్వంగ నీకు
జన్మ సాఫల్యమగు; నిత్య సౌఖ్య మొదవు.

రాజు -చిత్త మట్లేచేసి ధన్యుఁడ నయ్యెద. (భటునితో) ఓరీ సేవకా!

పెట్టిం బిలుమకొనిరా. వీరికి మన సభాసదనము ప్రక్కనుండు విహారాగారములో బస చేయింతము.

భోగ- (నాగతో) అంతయు అయిపోయినది. ఈలోక ఋణమును తీరినది. ఇక తప్పదు. పదరా! విధి తప్పదు.

భటు - ప్రభూ! చిత్తము.

(భోగ-నాగ దాసులజూచి) నా వెంట దయచేయుఁడుముని సార్వభౌములారా

నాగ -(భో-తో) ఈ రాజువద్దయుండు సేవకుఁడు మనలను జూచి యెంత హాస్యమాడుచున్నాఁడో చూచితివటరా? ఔరా! కాలమహిమ (అని చెరియొకరిచేయి పట్టుకొని నిష్క్రమింతురు.)



3 వ అంకము. 4 వ రంగము.

## విహారాగారము.

(నాగ, భోగ, దాసులు—పరిచారకుఁడు)

భోగః-(అటు యిటు చూచి) చంపలేక మనకీపని చేసినాఁడీ బావఁడు. కారాగృహము చీఁకటికొట్టు అని అంటూవుంటే యెట్లుండునో అనుకొనుచుంటి. అది యిచ్చట ప్రాప్తించె. ఇంతకంటె కారాగృహమా? వరిమెతుకులు, తియ్యని పిండివంటలు, దిన దినము పంపుతారు. అవి తినేది, యీ గుహాలో 'దేవుడా' యని పడియుండేది, ఏమి పాపిష్ఠితిండో? వీరి నాలుకలు గొయ్యా, యెట్లు తింటారో యీ పాడుతిండి. కాసు తిందమన్న, కలనైనను కనుపడదు. నాలుక నుగ్గయినది. బైటి కెక్కడికేని పోయి తిందమన్న పారా జవానులు వెంటబడుతారు. ఈ పాడు దయ్యాలు మనకు సేవకులట.

నాగ: ఇంతేరా! మనగతి. ఇక్కడ ముక్కున యూపిరున్నంత కాలము, కుళ్ళి చావవలసినదే. ఎవరో వస్తున్నారు. పూసలు తీసుకొని తిప్పుచుండు. కండ్లు మూసుకో. (కండ్లుమూసి జప మాల వెనుకనుండి ముందుకు దిప్పుదురు)

పరిచా:- (ప్రవేశించి) ఏమి వ్యథ యిది. ఒక గడియ కెనిమిది మాట్లు రాజుగారు వీరిని దర్శింప సమయ మరసి రమ్మన్నారని భటుడు వస్తాడు. వీరికి బదులు చెప్పలేక నాకో చావు వస్తుంది. వీరు నన్ను చూస్తే జపానికి కూర్చుంటారు. నేను కనుమఱుగైతే యేమేమో మాట్లాడుతారు. ఎవరినో తిట్టుకుంటారు. వీండ్లు యోగులట. ఇది యేమి యోగమో? నేను మఱుగున యుండి రాజుగారికి చెప్పిపంపి వీరు మాట్లాడుకొనే టప్పుడే ప్రభువు గారిని పిలిపిస్తాను. (అని మఱుగున యుండును)

భోగ - నాగ:- (పూసలు క్రింద వేసి)

భోగ:- ఈ బ్యాన్మడెంత వుపాయంగ మనలను, యీ బందీఖానలో వేయించినాడురా.

నాగ:- ఎంత కాళ్ళు సేతులు నఱికివేసినా ఆ బాపనబుద్ధి యెక్కడ విడుస్తుందిరా! అప్పుడు మనము తప్పు చేస్తిమిరా. (నిట్టూర్పు విడుతురు)

భోగ:- రాత్రికి కావలివారు నిద్రబోవు కాలములో తప్పించక పోదామా? లేకపోతే యిక్కడనుంచీ మనకు విడుదల కానే కాదు. యోచించు.

నాగ:- ఏమి యోచించేది? మన దగ్గఱ ఆయుధాలయిన వుంటే మన కడ్డము వచ్చేవాళ్ళను జయించుకొని వెళ్ళవచ్చును. నిరా యుధులమై చిక్కితిమి. గోడ లెక్కి దుమికితే కాళ్ళు యిరుగు తాయి. తలకాయలు పగులుతాయి.

భోగ:- అట్లా విరిగి చచ్చేదానికంటే యిట్లనే రాజుతిండి కమ్మంగ

తింటూవుండి చచ్చిపోదాము లేరా!

రాజు.- (ప్రవేశము - స్వగతము) ఇది సమయము. వీరు జపము మాని యున్నారు. పల్కరించెదను. (ప్రకాశముగ) నమస్కారము స్వాములారా!

(భోగ నాగయ్యలు ఊచ్చపడి యూరకుందురు)

రాజు:- స్వామీ! వృత్తి యంతర్ముఖమైన పిమ్మట, నది మఱల బహిర్ముఖము గాకుండునట్లు నిలుపుట కేమి యుపాయము? దయచేసి సెలవిండు.

భోగ:- (నాగయ్య ముఖముజూచి విస్మయముతో) ఇదే వుపాయము (అని వూరకుండును)

రాజు;-ఆహా! ఇది రహస్యము గదా! గనుక చెప్ప వచ్చునా? అని ఆవల వారిని అడిగి వారి సమ్మతిపొంది, స్వానుభవముగ తూష్ణీంభూతావస్థను చూపించి చెప్పినారు మహాత్ములు. (నాగయ్యతో) స్వామీ! నేను తమకు నమస్కరించి నపుడు తామేమియు ననక యూరకుండు టేల?

నాగ:-మాకేమీ తెలీదయ్యా. మా లోకమే మాది. నీ నమస్కారా లెవరికి కావాలె?

రాజు:- ఓహో! ఏమి తెలియకుండ తమంతట తామే నిస్పృహులై యద్వైతాత్మానుభవమున నుండువారని సెలవిచ్చెదరు. ఎంత వృత్తిరహితులు వీరు. నిజముగ శుక సనకాదులును వీరి కీడు గారు. (ఇద్దఱితో) స్వాములారా! నే నెంతగా తమకు శుశ్రూష చేయుచున్నను, తమ దేహము లేలా చిక్కిపోవుచున్నవి? తమ కేమి కావలెనో సెలవిండు. ఆహా! మీ దేహములు శల్యావశిష్టములై యున్నవే.

భోగ:- మాకే యుపచారములు వద్దు. మాకే శుశ్రూషలు వద్దు. మమ్ములను విడిస్తే అంతే ఛాలు రాజా.

రాజు:- ఔరా! వీరు నిరపేక్షులనియు, నొకరి నిర్బంధములో నుండ నిచ్చలేని వారనియు స్వేచ్ఛగా లోకమున సంచరించు నవధూత లనియు, సెలవిచ్చెదరు. ఆహా! ఇట్టి మహనీయుల సేవించిన నేను గదా ధన్యుఁడను. (స్వగతము) ఐనను నేను వీరి ముఖ విలాసములు, చూపులు, చేష్టలు, మాటల వైఖరి, జపమాల త్రిప్పుటను, చూచినపుడెల్ల నా యంతరాత్మ వీరి యోగ్యతను గుఱించియు, నిష్ఠా స్థైర్యమును గుఱించియు సంశయించుచుండు. ఇది యేమియో శ్రీ స్వాములతో మనవి చేసి, నా సంశయ ములను దీర్చుకొనియెద. (అని నిష్క్రమించును)

భోగ:-(నాగయ్యతో) వరే! రాజు మనలను నేమేమో బ్యమ్మజ్ఞానపు శాపన మాటలు అడగసాగితే మన కవి రావే, కనుక్కుంటా డేమోనే, అని నాకు గుండెలలో దడ దడ మంటా వుండెరా!

నాగ:-నాకు పాణంలో పాణం లేదురా. మన పుణ్యాం మంచిదిరా.

భోగ:- మనము చెప్పిన మాటలు రాజునకు, మిడతంభొట్ల శకునము వలె సమ్మ సరిపోయినాయిరా. ఇట్లాంటి మాటలు కొన్ని మనము నేర్చుకొని మాట్లాడుతా వుంటే, మనలను అందఱు జ్ఞానులనుకొని కాళ్ళకు మొక్కి పాలు, పండ్లు యిచ్చి పూజలు సేత్తారురా! నేర్చుకోవలె, బ్యమ్మగ్యానుల దగ్గరికిపోయి.

నాగ:_ ఇక్కడనుంచి మొదట విడిపించుకొని పోయిననాటికి చూతాములే. మొదట యీ పీడ విడిచిపొయ్యే దెట్లురా.

భోగ:-అందుకే గదూ నేను రాజుతో స్పష్టముగ జెప్పకుంటినే మన గోడు. మఱెప్పుడైనా యిట్లాంటి మాట లడిగితే, వూరికే తల వూస్తూ వుందాము. ఎవరో వస్తున్నట్లున్నది. వూసలు, పూసలు. కండ్లు, కండ్లు. (కండ్లుమూసి పూసలు త్రిప్పుదురు)

రాజు:- (ప్రవేశము - స్వగతము) శ్రీ గురుస్వాములవారు చక్కగ

సెలవిచ్చారు. వీరియందు సంశయముచే, నయోగ్యతారోపణ మహా భాగవతాపచారమట. వీరి నింక నిట్లు నిర్బంధింప రాదట. మంచిది. వీరిం బ్రార్థించి, బహుమాన పూర్వకముగా వీరిం బంపించెద. (ప్రకాశముగ) స్వాములారా! నమస్కారము.

భోగ - నాగ:- (ఇరువురు తల వూతురు)

రాజు:- తమరి నింతకాల మిచ్చట నిల్పిన పాపము నాకు రాకుండ ననుగ్రహింపుఁడు.

ఇద్దఱు:- (తల వూతురు)

రాజు:- (స్వగతము) ఇపుడే బండ్లకు ధనము నింపించి వీరికి సమర్పించి నా యాప్తులగు భటులనిచ్చి వెంట బంపెదను. (నిష్క్రమించును)

భోగ:- వింటివటరా! రాజుమాటలు. బహుమాన మేమి వున్నట్లు లేదురా!

నాగ:- బహుమానము లేకుంటే పోనీరా! మనలను విడిపిస్తా మన్నాడే రాజు. ఆయన పుణ్యము. అంతే చాలు. మనము బువ్వ తిని సిద్ధంగా వుందాము. పోదాము రారా!

భోగ:- ఐతే, గంతా బొంతా గట్టుకొని బిరీన పోదాము పదరా.

(ఇద్దఱు నిష్క్రమింతురు)



3 వ అంకము. 5 వ రంగము.

## జ య దే వ మ ం ది ర ము.

[జయదేవుని యొద్దకు సుదర్శనుఁడు, భటులు ప్రవేశము]

రాజు:- స్వామీ! నమస్కారము.

జయ:- నీకు నిరంతర సుఖముగుగాక! రాజా! వారి నంపితివా?

రాజు:- అంపితిని — కాని

జయ:- ఏమి చెప్పుము.

రాజు:- కోకిల వాకము.

అనఘులవారి మీా సెలవునంది ధనంబులచే
ఘన బహుమానముల్ సలిపి కాపుగ బంటులతో
డనిచితి త్రోవ వారు బడినట్టి విపద్దశ నే
విని వెస వచ్చినాఁడ మనవిన్ సలుపన్ దమతోన్.

జయ:- (ఆశ్చర్యముగ) విపద్దశ? వారికా? ఏ విపత్తు? ద్రవ్యమును చోరు లపహరించిరా? వారికి మఱేమైన నాపద కలిగెనా? శీఘ్రిమె చెపుము. వారు నా ప్రాణ సమానులు సుమా!

రాజు:- అట్లైన వారు నాకుం బ్రాణములకన్న ప్రియులు. నే నేమని విన్నవింతును స్వామీ? చెప్పుటకు నా నోరాడదు.

జయ:- చెపుము, చెపుము.

రాజు:- తరల వృత్తము.

ధనము, బండ్లును, వారు, బంట్లును, తర్లి త్రోవను బోవుచో
ఘనులు వారలు, శాంతి దక్కి సగర్వులై వెడ పల్కులన్
ధనము దక్కెను చిక్కెనా కలు త్రావనా పదమంచు న
ర్తనము సల్పెఁదొడంగి రట్టిది బ్రహ్మవేత్తల జాడయే.

జయ:- రాజా! అట్లు సంశయింపకు. ఆనంద తాండవమును, బ్రహ్మ వేత్తలకు గలదు. కల్లని, బ్రహ్మానందమునకు, సంకేతార్థముం గలదు. బలరాముఁడు నల్లబట్ట కట్టుకొని, కల్లు త్రావియుండెనని, పురాణముల వ్రాసియుండుట వినలేదా? అట్లనగా వశీకృత మాయుఁడై, బ్రహ్మానంద రసాభిరతుఁడై యుండెనని యర్థము కాదా? అవ్వల నేమయ్యె చెప్పుము.

రాజు:- ఇట్టివారి స్థితిగని, మా భటుండొకఁడు

మానినీ వృత్తము.

ఎవ్వరు మీారలు మా విభు దేశికుఁ డెట్లెటుఁగు న్నిమము జేసికి వా

రవ్వీధి మీాయెడ నెక్కువ కూరిమి యానటు లొప్పఁగఁ బల్కుటకున్
(భోగ - నాగ నవ్విరి)
నవ్వులుగావు నిజంబగు హేతువు నా కెఱిఁగింపుఁడు వేగన నన్
గొ్రివ్వన వారలు వాని గనుంగొని కోడిగమాడిరి పోడిమిగా.

జయ:- ఏమని?

రాజు:- ఈ విధముగ ననిరఁట స్వామీా!

మ॥ ఇటమున్నీ గురుఁ డుత్కళాధిపుని మంత్రీ్రందు్రండుగా నుండె, మే
మటఁ దద్భృత్యులమై వసించితి, మితం డాజేని శుద్ధాంత ము
ద్భటుఁడై చొచ్చిన తప్పునన్ గినుక దోఁప, న్వీని శీర్షంబు న
య్యటవిం గోయుఁడటంచు మమ్ము నరపాలాధీశుఁ డంపెన్ వెసన్

జయ:- ఊఁ - తరువాత.

మ॥ నరపాలోత్తము నాజ్ఞ మే మితని వెంటం గొంచు నా కాననాం
తరమున్ జొచ్చి శిలా తలంబున వధార్థం బీతనిన్ నిల్పఁగాఁ
గరుణోత్పాది మృదూక్తి దీనుఁడయి వీఁకన్ మమ్ము ప్రార్థించె వీఁ
డరినైనన్ శరణన్న విప్రు నఱుక న్యాయంబె? చేయూడునే?

జయ:- పిమ్మట,

రాజు:-

మ॥ అగుటన్ మేము దయార్ద్రభావమున నీ యత్యంత నీచుం ఖలుం
దెగ వ్రేయం న్మతిపుట్ట కాత్మ నిశితాతిక్రూర ఖడ్గంబులన్
వగతో నీతని చేతు లూరువులు ద్రెవ్వం జేసి మొండెంబు నూ
త గభీలంచు బడంగ వైచితిమి సత్యాం బింతయుం జూడుమా

జయ:- ఆవల?

రాజు:-

మ॥ అటమీాఁదన్ బ్రభునాన దీర్పమికి మ మ్మారాజు దండించునం
చటవిన్ జొచ్చి, పరిభ్రమించుచు ఫలాహారంబుతో నుండి పి
మ్మట నందొక్క గుహాంతరంబున మహా మౌనీంద్రు దర్శించి ప్రా
కట సద్బోధము, తత్ప్రసాదమున చిక్కం గంటిమో సేవకా!

జయ:- పిదప

రాజు:-

ఉ॥ కావున నప్పుడే మితని కంఠము ద్రెంపక పోవనిచ్చుటన్
భూవిభుతోడ నీ నిజము పోలఁగఁ జెప్పఁగ నూరకుంటకున్
సేవల భక్తి మమ్ముఁగనె; నీచుఁ డతండు ఖలుండు ద్రోహి మీ
భూవిభుఁడొక్క పెద్దయని ప్రజలోనరచెదు వానిఁ జూడుఁడీ

జయ:- ఆహా! నా యందు వారికెంత ప్రీతి. తరువాత నేమయ్యె?

రాజు:- అంతట -

చం॥ పెళపెళమంచు నాకసము పెల్లుగ గర్జిలె మేఘ ఘూర్ణమై;
జలజల రక్తబిందువుల జల్లు ధరాతలి ముంచెఁ; బచ్చికల్
మలమల మాడె; దిక్కులు తమంబును గార్కొనె; భూమి బ్రద్దలై
కులకుల గుల్లెంగె; నోదమున గూలిరి కోయని వారు బండ్లతోన్

జయ:- (దుఃఖముతో) ఆహా! ఇది దుస్సహము. అట్టి మహనీయుల
కా దుర్దశ రావచ్చునా? పరమేశ్వరా! శ్రీహరీ! వారి కేబాధయు
లేకుండఁ బరి రక్షింపుము స్వామీ.

మత్తకోకిల.

మేదినీశ్వర వారిఁబాసి నిమేషమైనను నిల్వఁగాఁ
గాదు నాకిఁక నేమి సేయుదు? కాలుసేతులు గల్గినన్
బోదు నచ్చటి కిప్పుడే

రాజు:- సరి, పోదమట్టులె స్వామి నే
గాదనం గలనే మహాత్మక! కట్టఁ బంపెద పాలకిన్

జయ:- శీఘ్రమే కానిమ్ము. ఇపుడే పోవలె.

రాజు:- చిత్తము. (భటునితో) ఓరీ! పాలకి నిచ్చటి కిప్పుడే
రావింపుము.

భటు:-(లోనికి పోయి, పునః ప్రవేశించి) మహాప్రభూ! పాలకి వచ్చి
యున్నది.

రాజు:- ఓరీ! మన స్వాములవారి నచుంచి, యీ యోదము నొద్దకు గొని పదండు. నేనును మంత్రితోడఁ గలిసి వచ్చెద.

భటు:- చిత్త మిదే వెళ్లెదను.

(నిష్క్రమించుచు — పరదా పడును)



3 వ అంకము. 6 వ రంగము.

అడవిలో యోదము నొద్ద.

(ప్రవేశము: జయదేవుఁడు, మేనాతో-వెంట సుదర్శనుఁడు: మంత్రి, భటులు)

భటు:- స్వామీ! ఇదే యీ యోదము. గడ్డ లురులుచున్నవి. దూరముగ దేవరవారు నిలువవలయు.

రాజు:- (చూచి, ఆశ్చర్యపడి) ఆహా!

తే॥ గీ॥ పుడమి తిమురైన నిచ్చోట పుట్టలేదు
పిడుగులేనియు నిచ్చట పడను లేదు
ఖనికు లిటదొల్చి పెట్టుమం దునుప లేదు
వ్రియ్యలై భూమి గుంగఁ గారణ మదేమొ?

మంత్రీ! ఇంకను కొంచెము దగ్గఱి చూతము. రమ్మెంత లోఁతున్నదో? (సమీపింపఁ బోవును)

భటు:- మహాప్రభూ! వలదు వలదు. ఆగుము. ఇప్పుడే బ్రిద్దలయియుండు భూమి యిది. దీని యంచుల పెళ్ళలింకను నురిలి, యగాధమగు నీ యోదమున మహా ధ్వనితోఁ బడుచున్నవి. (రాజు ముందు పోక నిలుచును)

జయ:- రాజేంద్రా! ఆ యోదము నాకుం జూపుము. నన్నచటకుం గొనిపొమ్ము.

(రాజు, మంత్రి-జయదేవుని దెచ్చి యోదముప్రక్కనుంచి)

రాజు:- ఇదే చూడుఁడు స్వామీ! ఏమి చిత్రమిది.

జయ:- (చూచి)

ఉ॥ హా మహానీయులార! కరుణార్ద్ర హృదంబుజులార! న్యాయమా
నా? మముఁ బాసిపోవ నహహా! బలిసద్మము చేరఁబోతి రే
భూమికి జాలెనో క్కొ తమ పూజ్యపదంబుల ధూళి యక్కటా!
మేమిఁక మిమ్ముఁబోలు ఘన మిత్రుల నెక్కడఁ జూతు మయ్యయో!

ఉ॥ ఏమి పరోపకార మతి యేమి మృదూక్తియు సత్యభాషణం
బేమి దయార్ద్రభావ మది యొంతటి నిశ్చలబుద్ధి యోగ మా
హా! మఱి యెందునైనఁ గననౌనె భవాదృశులం ధరాతలిన్;
మే మెటులుండువార మిట మీ రెటులింక గు మాకుఁ జెప్పరే?

రాజా! ఇంక నే నోర్వఁజాల, దుఃఖము పెరిగి వచ్చుచున్నది.

రాజు:- స్వామీ! తాము వ్యసనపడుట చూడ మాకును చిత్త విక్షేపము గలుగుచున్నది. నిదానించుడు. పోయినవారికై వగవ నేల?

జయ:- (కన్నీరు గార్చుచు) అట్లుగాదు. వారు విడువరాని మిత్రులు. నాకు పరమాప్తులు. కావున

కమల విలసిత వృత్తము.

కనికరమున మతి గరగుచు నుండున్
నను గొనిచని యట నలువగు నోదం
బున కతి పరిసరమున నిలుపుం డేఁ
గనుఁగొనియెద మది కటకట బాయన్

రాజు:- స్వామీ! వలదు. అది సమీపింప నపాయ స్థలము.

మణిగణ నికరము.

వలవదు గురువర! వలదటు చనఁగన్
బ్రళయ సమయమున వలె, ధర యురులున్

నిలువగఁ దగ దిట నెలవున కరుగక
వలె నెఱిగెద తమ పదముల కనఘా! (నమస్కరించును)

జయ:- మందాకాంత వృత్తము.

రాజేంద్రా! నా మనసు నిలుపక రాదు నే నొక్కమాఱు
భ్రాజద్గర్తంబటు కనులతో పారజూచి వత్తుక
పూజ ల్వేవైననను నరయనీ పుణ్య కార్యంబు సామ్యం
బే జన్మంబందయిన నగునే, యింత మాత్రంబు చాలుక

తొంగిచూచి మరలి వత్తు. రాజేంద్రా! నాయందు నీకు భక్తి గలదేని నన్నా యొద్దనం జేర్పవము. ఇంత మాత్రము పుణ్యము గట్టుకొనుము.

రాజు:-(మంత్రితో) మంత్రీ! వింటివా గురుస్వాముల యాజ్ఞ! ఎంత వలదని చెప్పినను మానరు. ఆ స్థలమా మిగుల నపాయమును, భయంకరమును. వారి నచ్చటికిఁ గొంపోవుటకు మిగుల సందియ మగుచున్నది. నేనేమి సేయుదు?

మంత్రి:- గురునాజ్ఞ మీఱుట మహా పాతకము. వారెఱుంగని దేమియు నుండఁజాలదు. మనము వారికిఁ జెప్పగలంత వారము కాము. వారి కోరిక చొప్పున వర్తించుట కర్తవ్యము. (జయ దేవుని నొద్దున నుంతురు)

జయ:- హా! (గోతిలో పడును)

భటు:- పడె పడె. గట్టు విరిగి పడె. అయ్యో! పడె. (చేతులు పిసికికొనును)

రాజు:- హా! హా! గురువరా! (క్రింద పడును)

మంత్రి:- రాజేంద్రా! లెమ్ము, లెమ్ము.

రాజు:- హా! మంత్రీ! నేనెంత పాపాత్ముఁడను. నన్ను ముట్టకుము. చేజేత గురుహత్య చేసిన ద్రోహిని. నా జన్మమేల కాల్పనా? లోకమేల మండనా?

ఉ॥ హా! గురునాయకా! భవమయాంబుధి నాశకరా! దయామయా!
హా! గుణరత్న రత్న నిలయా! దురితాంధ తమః ప్రభాకరా!
హా! గళితాభిమాన కలుషా! నిగమాంత వచో విభూషణా!
హా! గతిహీన దీన జనతాభయదా! ననుఁ బాయ న్యాయమా?

అయ్యో! స్వామీ!

చం॥ నిను నెడఁబాసి నే నిలువనేర్తునె యీ పుడమిం గురుప్రభూ!
యనలము బాసి యర్చియును, నభ్రముఁ బాసి తటిల్లతాంగియుం,
మనుజుని బాసి ఛాయ, రవి మండలముక్ బెడఁబాసి యెండయుం
గనఁబడునే? నిజంబుగ జగంబున నాగతి యంతయే యిఁకన్.

గురు సార్వభౌమా?

సీ॥ ఈవు నన్ బాసిపోయిన నాకు నీ రాజ్య
మేల? యీ రాజ్యాంగ జాల మేల?
యాలు బిడ్డలు బంధుజాలంబు లేల? యీ
ధన ధాన్య పశు భృత్య గణములేల?
స్రక్చందనాదిక సకల భోగములేల?
శృంగార మేల? యీ యంగమేల?
లోకంబు పొత్తేల? నాకు నీ బ్రదుకేల?
నేనను జ్ఞాపకంబైన నేల?

తే॥ సామవేదంబు నందలి సారమయిన
వాక్యమును సార్థకము చేసి వచ్చి నిన్ను
చేరఁగలవాఁడ నిదె నాదు స్థిరతరాత్మ
నిశ్చయంబిది తప్పను; నిజము నిజము.

మంత్రి:- రాజోత్తమా! పోయిన వారికై మీవంటి ఘనులు వాపోవుదురా? విగత జీవులయిన వారివెంట లోకమున నెవరేని పోవుచుందురా? సర్వ మెఱింగిన ధీశాలురగు తమకు నేనేమి చెప్పఁగలను. నేటితో గురువను మాట మఱవక తప్పదు.

రాజు:- హా! ఎట్టిమాట. ఇఁక నెక్కడి సద్గురూత్తముఁడు.

మంత్రి:- మఱవు మది. నేటితో సరి.

రాజు:- హరి హరీ! (చెవులు మూసికొని) మంత్రీ! అంతకన్న నధిక పాప మింకెద్ది యున్నది. అదియే గదా గురువధ. అట్టి పరమ కారుణికోత్తము నెట్లు మఱచుట?

చ॥ స్థిరమగు దేహమిచ్చి, గణుతింపగరాని సుఖంబొసంగి, దు
ర్భరమగు భీతిఁబాపి, పరిపంథి జయార్థము సాధనంబులన్
గరుణ ననుగ్రహించి, నయ కారణ కారుణికుం డితండె
యౌా గురుఁడు; వినశ్వరాంగమునుఁ గూర్చినవారె గురుల్ దలంపగన్

మఱియు

చ॥ చెలఁగి సమస్త దేశముల శ్రీ గురువేన్నమ యంచుఁ గాదె లో
కులు పనిసేతు రిందలి నిగూఢ రహస్యము నీ వెఱుంగుదే ?
వెలయ నెఱుంగ నీ సకల విశ్వము శ్రీ గురుమూర్తియే సుమీ!
కలుగ దతండుగానిది యొకండును, లెస్స విమర్శ చేసినన్

తే॥ గీ॥ కాన వారిని బాసి నే మేనుఁబూన (కత్తిదూసి)
నీ కృపాణంబుచేత నికృత్తకంఠ
నాశమొనరించి యీ మేని నాదు గురున
కర్పణము చేతు- (నఱుకుకొనఁ బోవును)

మంత్రి:- హా! హా! హా! వలదు, వలదు.

భటు:- అయ్యో! అయ్యో! ఇంకేమి గతి? వలదు మహాస్వామీ!

రాజు:- ............ ......చెప్పకుఁ డడ్డమిపుడు

మంత్రి:- (రాజుకత్తిని బట్టుకొని) ప్రభుచంద్రమా! నా చిన్న మనవి యొకటి యాలకింపుఁడు. వెనుక దేవరవారి చిత్తానుసారమే చేయుఁడు. త్వరపడకుఁడు. ఒక్క మాట.

రాజు:- (విసువున) ఏమిటది మంత్రీ! ఈ దేహమును ధరించుచుండు నొక్కొక్క నిముసము నొక్కొక్క యుగముగ దోఁచుచున్నది.

హృదయమున జాజ్వల్యమానములై మంట లెగయుచున్నవి. ప్రేవులు కలకలఁ దఱిగినట్లుగ దోఁచుచున్నది. ఇఁక క్షణముండఁ జాల; త్వరితముగఁ జెప్పుము. విని పోయెద.

మంత్రి:- దయచేసి యీ మాట చిత్తగింపుఁడు

కం॥ పురుషుఁడు పనిచేయక ముం
దరయవలయు దాన గలుగనగు కీడు న్మేల్,
త్వరపడరా దీయర్థము
చిరకారాఖ్యానమందుఁ జెప్పంబడియెన్

దేవరవారిపుడు బాగుగా యోజింపుఁడు

సీ॥ తాము మేను దొఱంగ తమదేవి మడియుఁ, బు
త్రుఁడు తల్లిదండ్రుల తోడనరుగు
మీరలు లేమిని మే మనాథులమయి
పోదు మెందేని; నీ భూమి యంతఁ
జెడు నరాజకమయి; చేటువాటిల్లు సా
ధువులకు, దుష్టులొందుదురు పెంపు;
వర్ణాశ్రమాచార వర్తనంబులు మాయు,
జనఘోష మెల్లెడలను నెసంగు;
ఆ॥ వె॥ నాత్మహత్య దోష మాత్మ ధర్మ త్యాగ
కలుష మకట మీకుఁ గలుగు; నందు
నపయశంబు, శాశ్వతాపకార ఫలంబు
నిందు నిలిచియుండు నెప్పు డధిప

రాజు:- (యోచించి తలయూచి)

మంత్రి:- మఱియు, నో వివేకనిధీ! మీరు గురువిరహ వ్యసనావేశ వేగమున నట్లంటిరిగాక, తామెఱుంగని న్యాయవిధు లేమిగలవు? నిర్మల చిత్తముచే యోచింతురా, సకల ధర్మసూక్ష్మములు ప్రతి ఫలింపక పోవు. మఱియొక మనవి.

తే॥ గీ॥ తనువు మనమును ధనమును మును పె గురున
కొసఁగి కుప్పసంబూడిన యురగ మట్టు
లున్నవారలు; మీరిప్పు డొరిమ గురున
కీ తనువునిత్తు మనుటిది యేటిమాట?

రాజు:- (కత్తి నొరలో నుంచుకొని) అహాహా! హిత సచివోత్తమ! యెట్టిమాటలు వచించి నా హృదయావేగ మడంచితివి. నీ బోధామృతము మదికి సోక, చల్లని తుషార ధారాపూరిత మయినట్లు తాప మడఁగినది. మంత్రీ! నీవీ విపత్సమయమున నాకిట్టి హితోపదేశము చేసి నన్ను విపదంబుధినుండి గట్టునఁ బడవేసితివి. నీ మేలెప్పటికిని మఱవను. సచివాగ్రణీ! మఱి నన్నిప్పు డేమి సేయుమని విధింతువు? ఆహా! మామక గురుచంద్రుని, బహుజన్మ కర్మ కఠిన శృంఖలా నిబద్ధుఁడనగు నన్నుద్ధరణ చేసిన గురుమూర్తిని, సుగుణసాంద్రుని, శాంత శమ దమ సద్గుణఖని నిఁక నే నెపుడు చూతు? ఏ తప మాచరింతు? ఇపుడా సంవిధాన విధానమును వచింపుఁడు.

మంత్రి:- మహనీయులగు గురుస్వాములవారి, యనుగ్రహ సుధాధారల పరితృప్తిం బొందియుండు మీకే నేమిచెప్పఁగలను. ఐనను,

తే॥ గీ॥ ఆపదను బొందినపుడును వ్యాధియందు
వ్యావహారిక కార్య సంభవమునందుఁ
దనకుఁ జిత్తము విక్షేప మొనయుఁ గాన
పరులబుద్ధిని యోచింపవలయు నరుఁడు

కావున దేవా! నాబుద్ధి తమచిత్తమునకు గ్రాహ్యమని తోఁచిన మనవి చేయుదు. చిత్తగింపుఁడు

కం॥ చేయను జెఱుపను మార్పను
నే యఖిలేశ్వరుఁ డెఱుంగు నీ విశ్వంబే

మాయికుని యధీనంబగు
నా యీశ్వరు శరణ మొందుమా వేయేలా?

రాజు:- మంచిది. మంత్రివరా! చక్కని మార్గమును బోధించితివి. అట్లు చేసెద. ఇచటనే కూర్చుండి, శ్రీ గురుచరణ స్మరణపూర్వకముగా, నియతేంద్రియుండనై నిరశనవ్రతముచేఁ బరమేశ్వరు నారాధించెద. (కూర్చుండి కన్నులుమూసి చిన్ముద్రచే)

సీ స ప ద్య ము.

ధ్యానంబు నిర్మల జ్ఞానస్వరూపున కావాహనంబు బ్రహ్మాండమయున
కాసనం బఖిలాంతరావాసునకు పాద్య మక్షరతుర పదాబ్జాంచితునకు
నర్ఘ్య మవ్యయ పురుషార్థప్రదాతకు నాచమనీయ మత్యంత శుచికి
స్నానంబు విమలామృతాప్లుతాకృతికి వస్త్రంబనావృత నిత్య రమ్యతనున
కుపవీత మఖిల యజ్ఞ పవిత్రమూర్తికి గంధంబు వాసనా కలుషహరున
కబ్జము ల్విషయ విషాపహర్తకు ధూప మద్వయానంగ చిదాత్మకునకు

తే॥ గీ॥ దీప మజ్ఞాన తిమిర నిర్వాపకునకు
నమృత నైవేద్య మఖిల పూర్ణాత్మకునకు
తమ్ములం బుపనిషదర్థ సమ్మతునకు
ప్రణతులై క్యానుగమన సంప్రాప్యునకును

ఉ॥ మంజుళ నైగమార్థ కుసుమంబుల భక్తిని నేర్పరించి, హృ
త్కంజమునిండ నించి, వితతంబగు నిర్మల దృష్టిఁ జిత్కళా
మంజరి నొల్కుచుండు పరమంబగు సౌఖ్యరసంబుఁ జిల్కి, పు
ష్పాంజలిఁ జేతు నిర్గుణ విహారికి భక్త తమఃప్రహారికిన్

ఉ॥ మంగళమూర్తికిం సుజన మానసవర్తికి యోగిగేయ ని
స్సంగ సుకీర్తికి న్నిహత సంసరణార్తికి నాత్మభేద దు
ర్భంగ నివారణైక జత పండిత బుద్ధ్యనువర్తి కేను సా
ష్టాంగ నమస్కృతు ల్సలిపి యంచిత భక్తిని సన్నుతించెదన్

ప్రవేశము శ్రీకృష్ణమూర్తి

కృష్ణ:- (సెలగోల చేతఁబూని చిఱునగవున) ఓహో సుదర్శనా! చాలు జాలు, చాలింపుము. నీ నిష్ఠను, అచంచల భక్తికిని, నీ నిర్మల స్తుతికిని మెచ్చితిని. నే నీ మనోరథం బెఱింగి దానిఁదీర్ప దలఁచిన రూపమునఁ దోఁచితి, నిటు చూడుము.

రాజు:- (కన్నులు దెఱచి లేచి సాగిలపడి, దోసిలొగ్గి) మహా ప్రసాదము - దేవ దేవా!

తే॥ గీ॥ అంతటను నిండియుండు మహానుభావ!
ఇట్టి యాకార మొంది నా యెదుట నీవు
తోఁచి నా వాంఛ నీడేర్పఁ దొడరు టెల్ల
భక్త వత్సల! నా పుణ్య ఫలము గాదె?
దేవతా సార్వభౌమ!

ఉ॥ ఏనన నాదు భక్తియన నెంత? మహాత్మ! శిశు ప్రగల్భమౌ
నా నుతి యెంత? నీ కవి యొనర్చె నె తృప్తి? యశేష దేవతా
ధ్యానము, దేవమౌని కృత తాండవసంయుత గానముం, దృఢం
బైన సమాధి, నీ కొసఁగునట్టి ముదం బివి యిచ్చెనే హరీ!

తే॥ గీ॥ సముఁడవగు నీకు భక్తుం డొసంగు నొక్క
తొళసిదళ మగు నా మేరుతుల్య మనుచు
శిష్టు లనుమాట నిజముగాఁ జేసినాఁడ
వంతయే కాని, నిన్నెన్న నగునె నాకు?

చ॥ భవ రహితుండ వీవు భవ పావక తాప పరీతులైన మా
నవులకు శాంతిఁ గూర్చుటకు జ్ఞానసుధం గురియింపఁగా ధరన్
బ్రవిమలమూర్తిఁ దాల్చిన పరాత్పర! నిన్ను మదీయ సద్గురుం
డవు జయదేవు నవ్య సుమనోమధువుం బ్రతికింప వేఁడెదన్

కృష్ణ:- మంచిది. సుదర్శనా! నీ విప్పుడు చెప్పినదియు సత్యమే.

శా॥ నన్నే నిత్యము నెన్నుచుం, జగమునంతం నాదు రూపంబుఁగా
విన్నాణంబుఁగ నెన్ని చొక్కు ఘనులే విఖ్యాతు; లౌ నాదు రూ

పన్నా! యోదమునందు నీ గుఱుఁడు సౌఖ్యంబొప్పఁగా నున్నవాఁ
డెన్నండైనను నాకు భక్తులకుఁ గీ డేపాటియుం సోఁకునే?
ఇదిగో! ఇతఁడే జయదేవుఁడు. వచ్చెఁ జూడు మిటు.

(జయదేవుఁడు భూమిలోనుండి పైకి వచ్చును)

రాజు:- (ఆశ్చర్యపడి) స్వామీ! సద్గురుప్రభూ! నమస్కార శతములు. ఆహా! ఈ జన్మముననే తమ సందర్శనము మరల నాకైనది. ఎంత ధన్యుఁడను. (కృష్ణుని జూచి) భక్తవత్సలా! పరమపురుషా! ఈ జయదేవ గురు స్వరూపము నీవని యే ననవరతము స్మరింతు. స్వామీ! ఈ నీ సన్నిధి నా కెప్పుడును నుండున ట్లనుగ్రహింపుము దేవా!

కృష్ణ:- మంచిది. సుదర్శనా! నేనే జయదేవుఁడనని యెఱింగి యాతని సేవించి నీవు నిజముగా ధన్యుఁడవైతివి.

రాజు:- మహా ప్రసాదము.

జయ:- (శ్రీ కృష్ణునితో) స్వామీ! లీలామానుష విగ్రహా!

చం॥ సకలము నీవయై సకల శబ్ద సులక్షిత నామరూప కో
టికిని విలక్షణుండవయి టెంకి యెఱుంగఁగ రాక నిత్య స
త్ప్రకట దురూహ్య రూపమున భాసిలు దేవ! మహానుభావ! నీ
వొక తనువొంది తోఁచుటది యొక్కరి కోరికఁ దీర్పనే కదా?

ఉ॥ తోఁచిన నీకు భక్తజనతోషక! నే నెదురేగి మ్రొక్కఁగా
నోచను, కాలుసేతులను న్యూనతఁ బొందిన కారణంబునన్;
వాచవి గానుపింతమన వాక్కు స్వతంత్రముగాదు, దేవ! నే
యాచనసేతు నా హృదయమందు వసింపుము రమ్ము నెమ్మితోన్

కృష్ణ:- మంచిది. అటులే ధ్యానింపుము.

జయ:-

చం॥ ఉపచరణీయమై కనుల కొప్పుగఁ దోఁచెడు నీదు రూపు నే
నిపు డెదలోన నిల్పుకొని హృద్గత చిన్మయవృత్తిచే పదా

ఉపచరణాంబులం శ్రుతిగతోక్తుల భక్తి స్మరించి చేయుదుఁగా
విపదపవారణ ప్రవణ వీక్షణ రక్షిత విశ్వమండలా!

(ధ్యానించుచుండును)

కృష్ణ:- జయదేవా! నీ హృదయము నాకు చిరకాలావాస
ముగ నున్నది. నీ యనన్యమగు భక్తియు నసదృశము.
వేయేల? నీవే నేనై యుండే యుండునట్లు తీవ్రతపం బొనర్చితివి.
నా కింతటి సంతుష్టి గలిగించిన నీ కోరిక యెదియేని నెరవేర్తు.
చెపు మిపుడేమి కావలెను?

జయ:- స్వామీ! జగద్రక్షకా! నాకు తమ నిజస్వరూప మపరోక్ష
మైన నింతకన్న నిఁక నేమియు కోరిక యొదవదు. తమ యనుగ్రహ
బలమున,

ఆ॥ వె॥ విషయ రూపమైన విశ్వంబు నీ మాయ
వలనఁ దోఁచు నీడవంటి దనుచు
నెఱిఁగినాఁడ నాకు నే కోరికయు నెందు
కెవరి కొఱకుఁ బుట్టు నెప్పుడైన?

ఇదియు సర్వాంతర్యామి వగు నీ వెఱుంగు దెఱింగియు "నడుగు
మేదేని నిచ్చెద" నని సెలవిచ్చితిరి గాన, తమ సిద్ధసంకల్పంబు
సత్యంబు గావలదా? కావున నవధరింపుఁడు.

ఆ॥ వె॥ భోగదా సాకందు, నాగదా సాక్కుఁడు
వీరు నన్ను మిగుల క్రూరబుద్ధిఁ
జూచువా రసత్య చోదితులై గర్త
గర్భమందు పడిరి; కావు వారి

కృష్ణ:- ఓహో! జయదేవా! ఎట్టి కోర్కె గోరితివి. నీకు ప్రతిపక్షులగు
వారికి మోక్షమిప్పింతువా? వారు నీ యెడ నిర్దయ వహించి
చేసిన చెయిదము మఱచితివా?

జయ:- రుక్మిణీ వల్లభా!

మ॥ మనుపా కంస జరాసుత ప్రముఖులొ పూర్వాపరుల్విన్ను దూ
షణ గావించిన, వారి దుష్కృతములం సైరించి సాయుజ్య మి
చ్చిన కారుణ్యము వీరిపై నెఱపి రక్షింపం దగుణ్ దేవ! నా
కనురక్తుండవయేని చేయుమిది కృష్ణా! దీనరక్షామణీ!

భటుః- ఔరా! "అడుగు మేదేని నిత్తు" నని దేవదేవుఁడే ప్రత్యక్షమై
చెప్పినపుడు, ముందుగా "నా కాలుసేతు లి" మ్మని యడుగ
రాదా? అయ్యో!

రాజు:- ఎంతటి నిరపేక్షుఁడీ మహాత్ముఁడు. చూచితివా మంత్రీ!

చం॥ అడవుల నెన్నియో యిడుమలంది తపంబొనరించి యోగు లే
ర్పడఁ గనలేని శ్రీహరి పరాత్పరుఁ డిట్లు ప్రసన్నుఁడై బయ
ల్పడి వరమిత్తు వేఁడుమని పల్కిన, శ్రీ గురువర్యుఁ డోదమం
దడుగున నుండు వారికయి ప్రార్థన సేయవొ డంగె రక్షకై.

కం॥ తన కాలుసేతు లిమ్మని
మునుపడి వేడంగ తలపు బొడమదు కంటే?

మంత్రి:- ఘనులకు పరోపకారం
బునఁ గలమతి యాత్మలాభమున నెక్కొనునే?

ఇంతయే కాదు వినుఁడు.

తే॥ గీ॥ నేను నాయది యిది యను జ్ఞానమెపుడు
లేని యీ బ్రహ్మవేత్తల మానసంబు
బ్రహ్మమును సబ్ధి వడగల్లు పగిది గరగి
లీనమైయుండు సదియున్న గానరాదు

కృష్ణ:- (జయ - తో) ఓహో! నీ చరిత్రమెంత వింత. జయదేవా!

ఉ॥ మందునకైన నీకడఁ బ్రమాదములే దతి నిర్మలంబు నీ
డెందము; శత్రు మిత్రుల నడిం దలపోయవు; మేరు పర్వతం
బుం దలపింతు ధైర్యమున; పొల్పగు నిత్య సమాధి నిష్ఠ నెం
దుం దులలేరు మీ కభయదుండవు నిత్యము భూతకోటికిన్.

మఱియు వినుము జయదేవా!

ఉ॥ నీ గుణముల్ గణింపనగునే పృథివీసుర యెంతవారికిం
బాగుగ నాకు నొప్పొనరుప న్సకలంబును మెచ్చె నిన్ను నీ
వీగతి మ్రొక్కమై నిలుచులేని దలంపక, పాప చిత్తుల
న్వేగమ బ్రోవ వేడితివి వేడఁగ నన్యము దోఁచదయ్యెనే?

(స్వ) తే॥ గీ॥ నాదు భక్తుల నడవడి నాకె తెలియు
వారి చిత్తంబులందు నే వదలకుంట
వేడినను వేడకున్న నే పాడి యెఱిఁగి
వారి కొఱఁతలు దీర్తు సత్వరము గాఁగ

(ప్రకాశముగ)

ఉ॥ కోరిక లేని నీవు మదిఁ గోరిన కోరిక తీరకుండునే?
వారిదె పాపముక్తులయి వచ్చిరి నా నిజరూప మొంది;
(నాగ - భోగులు చతుర్భుజములతో వత్తురు)

జయః-

నిర్వైర! దయానిధీ! పతితపావన! నీ కృపఁగాదె యింతయుం;
సారమతిం నినుం గొలువ, సాగని కోరిక లెందు నుండునే?

కృష్ణః-

ఉ॥ వ్యాసమహర్షి వీ వవని భక్తిని భూతదయం దితిక్షణ
భ్యాసము చేయురీతి జను లందఱకుం స్ఫుటమౌ విధంబుగాఁ
జేసి సమస్త శాస్త్రములఁ జిక్కిన యర్థము వెల్లడింప వి
చ్చేసితి కష్టమొంది తిఁక చేతులు కాళ్ళును దాల్చు మొయ్యనన్

(చేతులు కాళ్ళు వచ్చును. పుష్పవర్షము గురియును)

జయః- (సాగిలపడి మ్రొక్కి లేచి, చేతులు జోడించుకొని) ఇప్పుడు
గదా నా చేతులు కాళ్లు సార్థకములయ్యె. దేవా!

పద్మనాభ వృత్తము.

శ్రీకృష్ణ! గోవింద! భక్తప్రియా! శ్రీహరీ!
వాసుదేవా! దయాబ్ధీ! మహాత్మా! ఏకాలము న్నాకు
నీ కేవలప్రీతియే నిత్యముం జూపవే! పద్మనాభ!

రాజు:- సాకారమగా దేశికాకారమై నాకు
నశ్రాంత సాన్నిధ్య సౌఖ్యంబు నీవే;

కృష్ణ:- మీకెల్ల సౌఖ్యంబులుం గల్గు, సత్కీర్తి
మీ కొప్పు; కైవల్య మంతట లభించుఁగా.

భోగ - నాగులు:- (శ్రీకృష్ణుని జూచి) పరమ పురుషా! శరణు, శరణు. (జయదేవుని జూచి) మహానుభావా! నమస్కార శతములు.

సీ॥ మూఢత మాయావిమోహిత మతులమై
హేయమగా విషయ భోగేచ్ఛ మరగి
మీ మహామహిమ యేమియు గానగాలేక
నట్టడవిని మిమ్ము బట్టి కొట్టి
కాలుసేతులు కోసి, కటకటా! బావిలో
వేసి మీయందునే దోసమెంచి

సుమతి... ... ... ... ... ...

సుమ:- (లోపలనుండి) ఓహో! పరమేశ్వరు ననుగ్రహమున వారి సన్నిధికి నేను వచ్చితి. (వచ్చి నిలుచును)

భోగ:- ...సీతని జంపి, కుమతులమై ఘోర
పాతకంబులను జేచేత సల్పి

తే॥ గీ॥ గర్తమునఁ గూలినట్టి దుర్వర్తనులము
మీ యనుగ్రహమున నప్రమేయ కృపను
పాపములవాసి సుగుణ సంప్రాప్తి విష్ణు
పదముఁ బొందెద మానతీవలె క్షమించి

జయ:- అయ్యా! చిరతర సుఖం బనుభవింపుఁడు పొండు.

కృష్ణ:- ఇక రండు. (అందఱు నదృశ్యులగుదురు)

రాజు:- (జయదేవునకు మ్రొక్కి) స్వామీ! తమ చరిత్రమంతయు, మిగుల విచిత్రమగుచున్నది. తాము వ్యాసావతారమని శ్రీకృష్ణుఁడే యానతిచ్చె. గర్తమునఁ బడినవా రెవరో? మేము పాపాత్ములమని, యేమేమియో తమ్ము మన్నన వేఁడికొనిరి. సుమతి యను వాఁ డెవ్వడో? ఓహో యని వచ్చె. ఇదంతయుఁ దిలకింప నా హృదయము మిగుల విస్మయంబు గలిగించుచున్నది. ఇదిట్లుండ, ఔరా! మ్రొక్కుట కనువగునట్లు తమ పాదారవిందము మరల లభించుట, నాకు పోయిన ప్రాణములు, మరల వచ్చినంత లాభముగా నున్నది. మఱి మఱి మ్రొక్కువాఁడ (మ్రొక్కి) గురుప్రభూ!

చం॥ మునుపడ నూతి యొడ్డున మిముం గడు వేఁడితి మంత నీపురం
బున కరుదెంచినట్టి దినమున్మొద లిప్పటిదాఁక వత్సరం
బును బలుమాఱు వేఁడితిమి పోలఁగ మీ చరితంబు మాకుఁ జె
ప్పను మతిరాదు మీకకట; పాపులమే? వినరాదె మే మహా!

జయ:- ఆవిధముగా భావింపవలదు. చెప్పెదను లెమ్ము.

రాజు:-

కం॥ కాలం బిట్లని గడపితి
రేలా సందియము జెప్ప నిప్పుడు; నా ప్రా
ణాలాన జెప్పకుండిన——

జయ:- హరిహరీ! ఒట్టేల? దానితోఁ బనియేమి సుదర్శనా? (నిట్టూర్పు విడిచి యోచించును)

మంత్రి:- (జయదేవుని పాదములు పట్టుకొని)
......నాలోచన యేల జెప్పుఁడయ్యా మాకుఁ.

జయ:- అటులైనఁ జెప్పెదను వినుఁడు.

సీ॥ శ్రీ జగన్నాథ పురీ నికటంబున
తింమబిల్వ గ్రామమందు విప్ర
వరుఁడు నారాయణ భట్టుకు కమలాంబ
యందు జన్మించితి మయ్య మేము
ఆ జగత్పతి పురి యజ్ఞదేవుని పుత్రి
పద్మావతి కరంబుఁ బట్టినాము

రాజు:- ఔరా! మా కమ్మగారు సైతమున్నారా! ఆహా! ఆవల స్వామీ!

జయ:-

మధువన పురి వైశ్యమణి యగు ధనదగు
ప్తుని శిరంబున హస్త మునిచినాము

రాజు:- అతఁ డెంత పుణ్యాత్ముఁడు! ఆవల సెలవిండు.

జయ:-

అతఁడు రమ్మన, నింట సతి నిల్పి యా మధు
వనమును జేరఁగా వచ్చినాము

రాజు:- మా యమ్మగా రచ్చటనే యున్నారా? ఆహా! ఇట్టి మిముఁ బాసి యాతల్లి యింతకాల మేలాగున నున్నదో కదా. స్వామీ! ఇది వఱకే సెలవిచ్చియున్న ఆ తల్లి నిచటికి రావించి పూజించు కొనుచుందుము గదా! తరువాత

జయ:-

మధువనమున నొక్క మాసముండిన వెన్క
నింటికి బోవ నూహించినాము

రాజు:- పిమ్మట,

జయ:-

ధనదగుప్తుఁడు మాకు ధన మియ్యఁ బోయిన
వలదని గట్టిగాఁ బలికి నాము

రాజు:- సరేగదా! తమకు ధనమేల? తా మనపేక్షులని వాఁ డెఱుంగఁడేమో. అంత నేమయ్యె స్వామీ?

జయ:-

అంత వాఁడొక బండి నమరించి తన బంట్లు
నిరువుర మాకుఁ తోడిచ్చి యంపె

రాజు:- అంతట,

జయ:-

పోవుచో నడవిలోఁ బుణ్యాత్ములా బంట్లె
చోరులై యేతెంచి క్రూరమతిని

రాజు:- మీకు తోడుగా వచ్చిన యాబంట్లే యెందుకు చోరులైరి? ఏమి చేసిరి? చెప్పుఁడు, చెప్పుఁడు.

జయ:-

బండినిండను నింపఁ బడియుండిన వరాలు

రాజు:- వరా లెక్కడివి?

మంత్రి:- స్వాములకని ప్రీతితో గుప్తముగ ఆగుప్త యుంచి యుండ నోపు——

రాజు:- వరాలు కొనిపోయిరా?

జయ:-

......కొని బండివానిని గొట్టినారు

రాజు:- అయ్యో! అంతట?

జయ:-

చెలరేగి మా కాలు సేతులు నఱికి......

రాజు:- నారాయణ! నారాయణ!

జయ:-

యా పాడు నూతను నన్ను వైచినారు

రాజు:- హా! పరమేశ్వరా! యెంతకష్ట మెంత కష్టము. వినుచున్నప్పుడే మా గుండెలు వ్రయ్య లగుచున్నవే. తా మెట్లోర్చితిరి తండ్రీ!

ఆహా ! యేమి తమ నిగ్రహము? ఎవరా దురాత్ములు సెల విండని నాఁడే వేఁడితిమి. చెప్పరైతిరి. చెప్పియున్న నా పాపాత్ముల—

జయ:-

తే॥ గీ॥ వారలీ గర్తమందునఁ బడినవారె

రాజు:- వారేనా? సాధువులు! పరమ భాగవతులని తాము చెప్పినవారేనా, యిట్టి దురాత్ములు? అట్టి కటికలను తాము జ్ఞానులంటిరే? తగును వారి కీ దుర్గతి.

జయ:-

సుమతి యనువాఁడు బండివాఁ డమలుఁ డతఁడు

రాజు:- చోరులు, క్రూరులు వారి కెక్కడిదయ? వానిని జంపియే యుందురు.

జయ:-

ఈవలి చరిత్రమెల్ల నీ వెఱిఁగినదియె

రాజు:-

అంత పని యయ్యెనే చెప్పరైతి రకట!

దీని నంతయు, నెంత గోప్యముగ, నింతకాలము తమ హృదయమున దాచితిరి.

తే॥ గీ॥ ఇంత కాలంబు దాచితి రిదియదేల?

పాపులను పుణ్యులని తాము పలుకనేల?

పెద్దలగు తమ కపకృతి బిట్టొనర్చి

నట్టి పాపులు సుగతికి నరుగుటేల?

జయ:- ఓహో! దీని నంతయుఁ జెప్పెదము. నీ సందియములు దీర్చుకొనుము.

చం॥ కడచిన వాని నేదలఁప, కాగలవానికినై మనంబునన్

సుడిబడి యోచన ల్సలుప జూతును ప్రాప్తముల న్వినిస్పృహం

కడు బలవంతమైన నది కర్మము నిశ్చయమంచు దాని పో
బడి దలపోయ కేకమతి భవ్య వినిశ్చల వృత్తి నుండుదుర్
ఇది నా స్వభావము కాన, నే నెప్పుడు నీ ప్రశంస సేయనైతి.

రాజు:- ఆహా! ఎంత మంచి నిశ్చయమిది. ఎంత సుఖకరమైనది. ఇఁక రెండవ సంశయము స్వామీ!

జయ:- అదియుం జెప్పెద, సావధానముగ వినుము.

చం॥ పెనగొని తొంటి కర్మములు ప్రేరణ సేయఁగఁ బుట్టు భోగ సా
ధనమది దేహ, మట్లగుట దానికి హేతువు పూర్వకర్మమే;
ఘనమతి భావి సంచిత యుగంబును నిల్పితి దేహబీజమా
మునుపటి కర్మముర్ దయను పోకడ పెట్టినవారు పాపులే?

రాజు:- ఇది మహా రహస్యార్థము. ఇది తెలిసినచో, నపకారులను భావమే భ్రాంతి మూలమని స్పష్టమగు. ఆహా! ఇఁక మూఁడవ విషయము స్వామీ!

జయ:- విను మదియుం జెప్పెద

తే॥ గీ॥ అన్వయ వ్యతిరేకంబు లనఁగ రెండు
గలవు త్రోవలు బ్రహ్మంబు వెలయ నెఱుఁగ;
నందు రెండవ త్రోవచే నరిగినట్టి
ఘనులు వీరలు, వీరికి గలుగ దఘము.

ఇట్టివారే రావణాదులును. వారికి సుగతి గలుగలేదా? ఇదియుం గాక

కం॥ ఉడుగని బాములఁ బెట్టెడు
కడు బెట్టిదమైన తొంటి కర్మంబును ని
ల్కడ లేక బాధలిడు నా
యెడ మెయిఁ బెడబాపి చేసి రుపకృతి నాకున్

ఉ॥ నాకు మహోపకారము నొనర్చి యెఱుంగక కీడు చేసిన
ట్లాకులమంది నన్నె తమ స్వాంతములందుఁ దలంచి యెప్పుడుం

ప్రాకట కీటకంబు భ్రమరంబు దలంచి తలంచి భృంగతఁ
గైకొను నట్లు పుణ్యులయినా రిఁక వారికి మేలు గల్గదే?

మఱియుఁ విను మొకవేళ వారిం బాపులని యెంచినను

ఆ॥ వె॥ ఎట్టి పాపులైన నిసుమంత సాధుల
సంగ మొందిరేని సాధు లగుదు
రెంత నీచమైన నినుము బంగారగు
సుమ్ము పరుసవేది సోఁకెనేని

కావున, వారికి సుగతియే కలిగినది. ఇఁక నీ కేమి సంశయము గలదో చెప్పుము.

రాజు:- మఱియొక్కటి కలదు స్వామీ! తెలియఁగోరి యడిగెద. ఇది నాయెడ తప్పుగాఁ దలంపక కృపచే సెలవియ్యవలయు.

జయ:- సందియ మేల యడుగుము.

రాజు:- స్వామీ! తాము ముక్తులుగదా? ముక్తులకును ప్రారబ్ధ కర్మానుభవ మెట్లగును?

జయ:- వినుమయ్యా! ఇది యనుభవైక వేద్యము (చిఱునగవుతో)

తే॥ గీ॥ తన్ను మఱచినఁగాదె యీ తనువు దోఁచు
తనువుఁ దలఁచిన ప్రారబ్ధ మనుభవించు
తన్ను మఱవఁడు తనువును దలఁపఁ డతఁడు
వినుము ముక్తుఁ డసంగుఁడు విమలమూర్తి

రాజు:- ఆహా! ఎట్టి యర్థమును సెలవిచ్చితిరి. ఇది యెఱింగి బోధింప నెవరి తరము? మహాస్వామీ! తమ దేవేరిగారి నిచ్చోటికి రావింప ననుజ్ఞ యిండు. మిమ్ముద్దఱిని లోక ముద్ధరింప నవతరించిన సనాతన దంపతులనుగా దలంచి పూజింప, నా కిచ్చ పొడముచున్నది. దయచేసి సెలవిండు.



జయ:- మంచిది (అని యోచించుచుండును)

రాజు:- చిత్తము. మఱేమి యోచించెదరు.

జయః:- ఏదేని మా యానవాలు లేకున్న, నేనే యిందున్నానని యా సతి యెట్లు నమ్మును?

రాజు:- అదియును నిజమే. సంభ్రమమున మఱచితి. (యోచించి) స్వామీ! తమ గుణరూపాదికము వర్ణించినఁ జాలదా?

జయః:- మనుష్యు లోకరింబోలి యొక రుండఁగూడదా యని, సంశయము కలుగవచ్చు. నే నొక సంకేతము వ్రాసియిచ్చెద. దాని నొక బ్రాహ్మణునిచే నంపుము. (ఒక పండుటాకున పుల్లతో వ్రాసి యిచ్చును)

రాజు:- మహా ప్రసాదము. (పుచ్చుకొని కన్నులకు నొత్తుకొని) ఇఁక నింటికి వెడలుదము. మేము తమ వెంటఁ బాదచారులమై వత్తుము. (భటులతో) ఓరీ సేవకులు! మీ రిపుడే వైశమ పురిఁజేరి పట్టణమున మహోత్సవముఁ జాటింపఁబంపుఁడు. మున్ముందుగా పరుగున జనుఁడు.

భటుః:- చిత్తము (అందఱు నిష్క్రమింతురు)



## అ ర ణ్య ము.

(యజ్ఞదేవుఁడు, ఇతని మిత్రుఁడు త్రివిక్రముఁడు ప్రవేశింతురు)

యజ్ఞ:- కటకటా!

ఉ॥ ఎంతటి పాపకర్ముఁడ నదృష్టవిహీనుఁడ నో త్రివిక్రమా!
చింతల గుళ్ళిపోవుటకు జేసెను నన్ను విధాత కూతుకై;
వింతగనున్న దెందుజనె వేసురుభంగి విదేశముల్ వనా
భ్యంతరము ల్ప్రవిద్దుహలు నారసి కోమలిఁగానమైతిమే

ఇఁక నేమి గతి సఖా! జయదేవుఁడు మహానుభావుఁడు, సాక్షా ద్వ్యాసావతారమని నా స్వప్నగతుండైన భగవంతుని వలన నెఱిఁగి, నెన్నియో తపంబు లొనర్చి, తీర్థయాత్రలు, దానములను జేసి బడసిన నా ముద్దుల పట్టిని, వారి కిచ్చితిని. ఏమి ఫలము? వారిరువురు, నద్దు ముద్దుగా సుఖించుచుండ, నా కన్నుల కఱవు దీరఁ జూచు ప్రాప్తి నాకు లేదాయె? హా పద్మావతీ! హా జయదేవ!

మధు:- (ప్రవేశించి - స్వగతము) దైవాధీన మిది. జయదేవుని నిం దెవరో పిలుచుచున్నట్లున్నది. వారిని వెదకు నా ప్రయాస నేటితో తీరునా? (సమీపించి-ప్రకాశముగ) ఎవరక్కడ? జయదేవుఁడేడీ?

త్రివి:- (వంగిచూచి) ఈ చీఁకటివేళలో, నీ యడవికి వచ్చిన నీ వెవరు? జయదేవుని నీ వెఱుఁగుదువా?

మధు:- అయ్యా! నే నెఱుఁగనా? ఆహా! వారు పరమ సాధువులు. అయ్యా! మాది మధువనము. నేను ధనదగుప్తుని పురోహితుఁడను మధుసూదనుఁ డనువాఁడ. మా యూరం జయదేవుఁ డొక్క సంవత్సరము క్రిందట, నొక నెల ధనదగుప్తుని యతిథిగా నుండె. అతిథి యేమి? వారు ధనదగుప్తుని దేశికులై యుండిరి. అంతట

పూజ్యులగు వారి, నతఁడు సబహుమాన పురస్సరముగా మరల తింపుబిల్వమున కనిచె.

త్రివి:- తరువాత? వారి జాడ చిక్కినదా?

మధు:- ఎక్కడ చిక్కుట? చిక్కియున్న మే మింతదూర మేల వత్తుము? వినుండు చెప్పెద. ధనదగుప్తుఁడు వారి వెంటనంపి యున్న యిరువురు బంట్లు, మరల నూరి ముఖమే చూడరైరి. వారి నతఁడు వెదకించుచుండగా నొకఁడు పద్మావతీదేవిగారి యొద్ద నుండి జయదేవుని కొఱకు వచ్చె. దాన, వారూరు చేరమి విస్పష్టమై యది మొదలతఁడు వ్యాకులచిత్తుఁడై నిద్రాహార ముల వర్జించి, యమ్మహాత్ముని వెదకుటకని, బ్రాహ్మణుల ననే కుల నానా దేశముల కనిచియున్నాఁడు. అందు నే నొక్కఁడను. నేనును విసుగుకొనక నానా జనపద పుర నగరారణ్య గిరి గుహాంతరాదుల నెల్లను, వారికై వెదకుచుం బోవుతరి నిచ్చట వారి పేరు వినబడిన, నిలువబడి, చిక్కిరని యిటు వచ్చితి. ఇచ్చటనూ గనపడరే? వారి నిఁక నెంతని వెదకుదు? నెందుజూతు? హా! ఇంకేమి గతి? (నిశ్చేష్టుఁడగును)

యజ్ఞ:- నాయనా! మధుసూదనా! పాపిష్ఠుఁడనగు నా గర్భవాసము నందు బుట్టినకతన, నా ముద్దుల పట్టియగు పద్మావతి కీ దుర్దశ సంభవించినది.

మధు:- ఏమి? ఆ తల్లి యున్నదిగదా! ఆహా! భర్తృ వియోగ దుఃఖము నెట్లు భరించియున్నది?

యజ్ఞ:- ఎందున్నది? ఉన్న వార్తయే మాకు దొరకదయ్యె? మే మా సాధ్వికై, చొరరాని చోట్లెల్లను జొచ్చి, పడరాని యిడు మలన్నియుం బడితిమి. తిరిగి తిరిగి, మా కాళ్ళు రాళ్ళయినవి. ఆమె జాడయే చిక్కదయ్యె. హా! ఇంక విధి విధాన మెట్లున్నదో గదా! (నిశ్చేష్టుఁడగును)

త్రివి:- మిత్రమా! ధైర్య మూనుము. అందఱు మిట్లు వ్యాకుల పడుచున్న మనల నీ నిర్జనారణ్యమున నోదార్చు వారెవరు?

మధు:- పద్మావతీదేవిగా రిల్లువాసి యేల చనిరి?

యజ్ఞ:- ఏమని చెప్పుటకు నోరాడకున్నది. అకటా! సుఖ పడునని మేము తలంచినందుకు దానికి సకల కష్టములు వచ్చినవి. ఆ బిడ, పంపినవాఁడు మరల వచ్చి జయదేవుఁడు మఠమునందున లేఁడని చెప్పినప్పటినుండియు, రేయిం బవళ్ళు, జయదేవ సార్వభౌమా యను స్మరణమున కంటికి మంటికి, నేకధారయగు కన్నీటికి, విరామము గలుగదు. ఇఁక నాహార నిద్రలు లేవని వేఱుగా చెప్ప నక్కఱలేదు గదా! ఆమె యిట్లు గుండె కందుచుండ, తమ యేక పుత్రుఁడు రాడాయెనని దాని యత్త మామలగు వృద్ధులు—

మధు:- వారేమైరి?

యజ్ఞ:- అడవింబడి పోయిరి. వారిగతి యిప్పటి కేమయ్యెనో యెఱుఁగము. అంత పద్మావతి అత్తగారింట నొంటరిగా నుండఁజాలక దీనాననయై యనాథవలె జగన్నాథపురమున గల మా యింటికి పాదచారిణియై యేతెంచె.

మధు:- కటకటా! అమ్మహాసాధ్వీ శిరోమణి కిట్టి దుస్థితి రానగునా? నారాయణ! నారాయణ! ఆవల,

యజ్ఞ:- ఆమె రాకఁ జూచినప్పుడే మా మనంబులు విఱిగినవి. పిదప నామె వలన మేమీ యుదంతమంతయు విని, లేనిధైర్య మభినయించుచు, దుఃఖము దిగమ్రింగి, "అమ్మా! చింత మానుము తల్లీ! జయదేవుని వెదకించి రావింతు"మని, యెంతయో యూరడించితిమి కాని, ఆమె కా ప్రయత్నమేమియు సుస్థితి గల్గించినది కాదు. నానాటికి లోలోన శోక మధికమగుటచే నామె యొకనాటి రేయి, మేమించుక కూర్కియుండు తఱిజూచి, యేకాకియై,

యెచ్చటి కేగినదో, యిప్పటి వరకు, నెందు వెదకినం గానరాదు. ఇఁక నేమి సేయుదము మధుసూదనా? ఏమిగతి త్రివిక్రమా! (అని చదికిలఁబడును)

మధు:- శ్రీహరీ! ఆమె యెంతటి యిడుమలు కుడువవలసి వచ్చె? నారాయణా! (నిశ్చేష్టుఁడగును)

త్రివి:- సఖా! ఇట్లు కుప్పఁగూలి, అందఱు కూర్చున్న నేమిగతి? నాకొక్కటి స్ఫురించినది, వినుఁడు. పద్మావతి పసిది. ఇల్లుబాసి యెన్నఁడు నొంటిగా నెందేనిం బోయినది కాదు. భీరువు-అబల! కాలము కొలఁదిని కుమిలివచ్చు శోకముఁ బట్టఁజాలక, యిల్లు వెడలినను నా సమీపముననే యెందేని నుండనోపు. కాని యింత దవ్వేలవచ్చు? ఆ ప్రాంతముననే, మరల జూతము రండు, లెండు. నీవును మావెంట రమ్ము మధుసూదనా!

మధు:- అవశ్యముగ వచ్చెదను. (నిష్క్రమింతురు.)



4 వ అంకము. 2 వ రంగము.

## అ ర ణ్య ము.

(పద్మావతి చీఁకటిలో నొక చెట్టుక్రింద కూర్చుండి)

సీ॥ పొక్కిపోయెను పాదములు గుల్కఁ్రొల్లొత్తి
గుట్ట గుట్టయు కొండకొండ తిరిగి
చీర పేలికలయ్యె చీలె నా మేనెల్లఁ
దొడరి కంపలు పొద ల్దూరి దూరి
ఎండకు గాలికి నిట గుమ్మరుట నోరు
పట్టిపోయెను నీరుపట్టు బుట్టి
యాహారమును నిద్ర యావంతయును లేక
కన్నులు పచ్చనై కానరావు

తే॥ గీ॥ కటకటా! ప్రాణనాథ! యీ కటికదాని
యందు నీకేల దయ గల్గదయ్యె నింక
నెందు వెదకుదు? నెందేని నేగుటకును
కాళ్లు లాడుటలే దెద్ది గతియొ నాకు.

(నలుప్రక్కల జూచి)

ఉ॥ ఏల సృజించె నన్ను విధి యీ గతి కానల గుందుమంచు; నే
నేల విభుండు వాయ పతిహీనత ప్రాణములం ధరింపగా?
నేల వృథా ప్రయాసమిక నెంచుదు నా ప్రియుఁ గానజాల; నిం
కేల నిరర్థకంబయిన యీ యడియాసలు మానసంబునన్

(యోచించి)

తే॥ గీ॥ హా! మనోనాథ! నాథ! నా ప్రాణనాథ!
హా! దయా నిలయా! ప్రియా! హా గుణాఢ్య!
అకట నిను బాయఁజాలని యబల, బడలి
కాన బలవించుచున్నది; కానఁగదవె.

హా! ప్రాణనాథా! నా నాథా! నాథా! (అని మూర్ఛిల్లుచు.)

(ప్రవేశము: త్రివిక్రమ, మధు, యజ్ఞదేవులు)

త్రివి:- ఏమిది! ఇచ్చట, నీ చీఁకటిలో నొకయబలా విలాపధ్వని!

(ఆలకించి నిలుతురు)

మధు:- ఇటు రండు. (ముందు పోదురు)

త్రివి:- (మధుసూదనుని చేయిపట్టి) అది యేమియో బాగుగా విని, మఱి డగ్గఱియెదము. అరణ్యములందు వనదేవతలును, పెను భూతములును నిట్లు నానారూపముల నుండుట కలదు. నిదానించుడు (అందఱు నిలిచి విందురు)

పద్మా:- సీ॥ న్యాయమా? నీకిది శ్రేయమా? జ్ఞాన వి
ధానమా? యిటు జేయఁ బ్రాణకాంత!
ధర్మమా? నీ కింత మర్మమా? లేక నా
కర్మమా? నిరసింప ధర్మనిరత!

రోసమా నాపైన? దోసమా? లేక సం
తోసమా? నీకు నిట్టగాసిఁబెట్ట
బీరమా? నా గ్రహచారమా? లేక నా
నేరమా? యీరీతి వేరుసేయ;

తే॥ గీ॥ ఏల దలకవు? బలుకవిదేల? దుఃఖ
జ్వాల కీలావలిలో గాలి జాలిబొందు
నీ లతాంగిని రక్షింపఁజాలవేమి
చెలుపుమో నాథ! నా నాథ! దీననాథ! (క్రిందబడి లేచి)

ఉ॥ పోయిన ప్రాణముల్ మఱలె భూమిని నా ప్రియుఁడుండనోపునా
హా! యిదె వామనేత్రము భయంపడవల్దను—వట్టి యాసలే
లా? యిఁక నేటివల్ల భుఁడహా యిఁక వారిట వచ్చుటేడ నా
యాయు విశేంతయున్నదొ కదా? జయదేవ! యిఁకేమిసేయుదున్.

హా! మనోహరా! (మూర్ఛిల్లును.)

యజ్ఞ:-ఇది పద్మావతి స్వరమే. సందియము లేదు. అయ్యో! శోష చేతను, డగ్గుత్తిక చేతను, హీనమై వణకుచున్నది. కటకటా! చీఁకటిలో నొంటిగా క్రూరమృగ భూయిష్ఠమగు నీ కాఱడవిలోని కెట్లు వచ్చినది? ఔరా! విధిసేత! డగ్గరుదము రండు.

త్రివి:- (ముందు నడచిచూచి) నిశ్శబ్దముగా నున్నదే. ఇదియేమి? (అందఱు జూతురు)

యజ్ఞ:- అయ్యో! క్రింద పడియున్నది. (దగ్గఱ కూర్చుండి పద్మావతి తల తొడపైనిడి)

హా! యింకేమున్నది! పద్మావతీ! హారిహారీ! విలపించి విలపించి గొంతెండి ప్రాణము పోయినది.

హా! ప్రియపుత్రీ!

చం॥ దిరిసెపుఁ బువ్వుఁబోలు మృదు దేహము వైచితి గుల్కారాలపై
తరుణిరో! యేడ్చియేడ్చి కనుదమ్ములు హా! ముకుళించె చీఁకటిన్

కరమరుదైన నీ గుణము కానలఁ గాచిన వెన్నెలమ్మె; నీ
దురితపు లోకముం దెగడి దూరముపోయితె ముద్దు కూతురా!

త్రివి:- (చేతినాడిఁ జూచి) స్వామీ! త్వరపడకుండు. ఏల వగచెదరు? ఈమె మూర్ఛపోయినది కాని, నిజముగా నిది మృతికాదు సుమా? నిదానించుఁడు (కన్నీరుఁ దుడిచికొని, చూచి, తట్టి, చెవ్వులుమూసి, గడ్డము పుడికి) అమ్మా! పద్మావతీ! పద్మా!

పద్మా:- (ఉలికిపడి లేచి, కూర్చుండి, నలుదెసలు చూచి) అయ్యా! మీ రెవరు? పుణ్యాత్ములారా! నా జీవితేశ్వరుఁడగు జయదేవ స్వామిని నెందైన జూచినారా? నా తండ్రిలారా! ఎఱిఁగియున్నఁ జెప్పి నాకు ప్రాణభిక్షఁ బెట్టుఁడు.

యజ్ఞ:-అమ్మా! పద్మావతీ! నా తల్లీ!

ఆ॥ వె॥ నిన్ను గన్నతండ్రి నేలాతినైతినే?
లోకమెల్ల పాడె నీకు పుత్రి!
ఇట్లు కాఱడవికి నెట్లు వచ్చితి వొంటి
నెట్లు తేర్తు నిన్ను నెవరు దిక్కు?

పద్మా:- నాయనా! నా తండ్రీ! నీవేల యిట్లు వచ్చితివి. (పాదములకు నమస్కరించి) నా ప్రాణవల్లభు జాడ గానరాదు గదా! అట్లయిన నిఁక నా యాశ వదలుము. నేను పుట్టనే లేదనుకొనుము.

తే॥ గీ॥ నా మనోనాథు గాంచ నే నోమనైతి;
ప్రాణనాథుని బాసిన దాని బ్రతుకు
ప్రాణమును బాసినట్టి నెమ్మేను సాటి;
గాన నేనును బాయుదు ప్రాణములను

(పద్మాసనము వేసికొని సిద్ధపడినచో)

యజ్ఞ:-(గడ్డముఁ బట్టుకొని) అమ్మా సాహసింపకుము.

పద్మా:- తే॥గీ॥ తండ్రి! వగవకు; మ్రొక్కెద-ధైర్యమూను

(కాళ్ళకు మ్రొక్కును)

త్రివి:- తల్లీ! నిదానించుము.

మధు:- త్వరపడవలదమ్మా!

పద్మా:- ... కన్నతల్లికి నా నమస్కారమనుము.

యజ్ఞ:-అమ్మాయీ! నేను మాత్రము బ్రతికి యింటికి పోయిన గదా

పద్మా:- ... నాదు ప్రాణేశుఁడున్నఁ గానంగనైన

త్రివి:- ఉన్నాఁడు. కాన వచ్చును. త్వరపడి తెంపుసేయకు.

పద్మా:- ... దాసి మిమ్మెంచుచును మేను బాసె ననుము

అందఱు:-ఇట్టి యశ్లీలవాక్కుల బలుకకమ్మా!

పద్మా:-హా! జయదేవా! జీవితేశ్వరా! నాకెన్ని జన్మములకును నీవే భర్తవగుము. నీ పాదాబ్జములే నాకెప్పటికిగతి. నే నిదే వచ్చి తమ చరణ సరసిజంబుల సందర్శించెద. (కన్నులు మూసి కొని) జయదేవా! స్వామీ! (ఊరకుండును)

యజ్ఞ:- హా! హా! తనయా! వలదు వలదు. మమ్మెల్లర విపత్తుల ముంపకుము. ఇదిగో! నీ వెంట మేమును వత్తుము. కానీ పొమ్మా. (కౌగలించును)

త్రివి:- మధు:- అమ్మా! వలదు. కొంచెము నిదానించుము. సాహసింపకుము. ఒక్కమాట. (త్రివి-యజ్ఞ చెవులో)

పద్మా:-అయ్యో! ఏమది? ఏల నన్ను వారింతురు? నేనీ దుఃఖానలమున మ్రిందజాల (నిట్టూర్పు విడుచును)

యజ్ఞ:-అమ్మా! పద్మా! పెద్దవాఁడను-నీ తండ్రిని. వీరో-సద్బ్రాహ్మణులు. మేమందఱమును నీకొకమాటఁ జెప్పెదము. నీవా గుణ నిధివి. ఇట్టి విపత్సమయమున మా మాట వినఁదగు.

త్రివి- మధు:-ఇదమిత్థమని మాటనిచ్చుదాక, మీ పాదముల మేము విడువఁ జాలము. (ఇద్దఱు పాదములు పట్టుకొందురు)

పద్మా:-(యోచించి విశ్వసించి స్వగ) ఇఁక నే నేమిసేయుదు? నీ రాటంకము చేయుదు రేల? (ప్రకాశముగ) హరిహరీ! నా పాదములు ముట్టకుఁడు. అయ్యలారా! లెండు. (యజ్ఞదేవునితో) తండ్రి! యేమది ? ఏమి సెలవు ?

యజ్ఞ:-మా వెంట నీ వింటివఱకు రమ్ము. మూఁడు దినము లుండుము. ఇంతలో నీ భర్తజాడ తెలియకున్న పిమ్మట నీ యిష్టము. మేము మాఱు పలుకము. ఇప్పుడు మాత్రము ధైర్యమూనుము. ఇంటి వఱకు లేచిరమ్ము. లెమ్ము.

త్రివి:-ఇంతమాత్ర మనుగ్రహించి సమ్మతింపుమమ్మా !

మధు:-ఇది మా కందఱకును మిక్కిలి సమ్మతము. (స్వగ) ఆవల జగదీశ్వరుఁడే దిక్కు. నాటికొక్క దైవము లేఁడా?

పద్మా:-ఆ॥ వె॥ కన్నతండ్రి మాట కాదనగాఁ జాల
ప్రాణనాథు బాసి బ్రతుకఁ జాల
నేమిసేయవచ్చు నెట్లిఁక గడపుదు
మూఁడు దినము లెండ్లు మూఁడు నాకు.

మంచిది నాయనా! పెద్దల మాట మీరజాల. అట్లే కానిండు. (లేచి నడవబోయి వణకును) ఆహా! కాళ్లు తేలిపోవుచున్నవి. నేల నానకున్నవి. కన్నులు తిరుగుచున్నవి. దేహమున నిసుమంతయు త్రాణలేదు. నేనెట్లు నడువగలను ? ఇఁక నాకేల యీ పాడుబ్రతుకు.

యజ్ఞ:- అమ్మా ! తిన్నగా నేను నడపింతును. చేయూఁతగా పట్టి నడువుము. మెల్లగ రమ్ము. (స్వ) అయ్యో! పాపము. ఆహారము లేనికతన శక్తిహీనయై నడువజాలకున్నది. (నిష్క్రమింతురు.)



జగన్నాథపురము.

ప్రవేశము — పద్మావతి, సుమిత్ర.

పద్మా:- అమ్మా! పెద్దవారందఱు చేరి తెచ్చిపెట్టిన చిక్కుఁడి. లేకున్న నే నిప్పటికి మూఁడు దినముల నాఁడే, యీ చింతాసముద్రముం దాఁటి యీ దుఃఖశరీరమును వీడి, నా నాథుఁడగు జయదేవ భూసుర సార్వభౌము పాదారవిందముల సన్నిధిఁ జేరి సుఖనై యుందును. ఆ భాగ్యమునకును మా నాన్నగారే అడ్డగించిరి. అకటా! నేఁడు సాయంసమయము వఱకు ప్రాణమెట్లు నిలుపు కొందును. హా! ప్రాణ ప్రియా!

సీ॥ కల్యాణి యని నన్ను గారవించిన ప్రీతి
మఱచితివా? యెట్లు మఱపు వచ్చె
వేగంబె వచ్చెద వెలవెలఁ బోవకు
మను నాదరంబు నేమయ్యె నకట
నిను బాసియుండ లేనని యెఱింగియు, రాక
తడసితేమిట మహా ధర్మమూర్తి
నను ననాదరణ చేసినమాను, తమ తల్లి
దండ్రుల నైన నను దలపరాదె?

తే॥ గీ॥ ఎందు నున్నాఁడ? వున్న నీ వేలరావు?
మునిఁగితో కష్టదశలలో? మునులలోన
జేరి యవికల్పనిష్ఠ సుస్థిరుఁడ వైతొ
బ్రదికి యున్నావొ? చేరితో బ్రహ్మమందు.

హా! ప్రాణప్రియా! నీ యధీనమైన, యీదీనురాలి గతి యేమి చేసితివి.

సుమి:- అయ్యో! పుత్రికామణీ! ఎన్ని విధముల జెప్పినను నీ వంత కంతము లేదు. నే నేమిసేయుదు? ఆహారనీరములా-యాలింపవు. నిదురయా - మఱచితివి.

సీ॥ స్నానంబు సేయ వస్త్రము నీటి నాసింప
వెప్పుడు జూచిన నేడ్చుచుందు;
తల దువ్వుకొనవు పువ్వులు గంధమును ముట్ట
వేసొమ్ము గన్నుల నేని గనవు
పతి యూరికేగినప్పటినుండి కట్టిన
చీర విప్పవు, క్రొత్త చీర గొనవు;
నీ నోటి మాటను వీనులార వినంగ
నోచనైతిమి, మాకుఁ దోచ దెదియు;
తే॥ గీ॥ కనకలత వంటి నీ మేను కట్టెయయ్యె
నయ్యయో! పాడుకన్నుల నట్టి నిన్ను
నిట్టి దుర్దశఁజూడ మాకేల వ్రాసె
దైవ మీకష్టముల నెట్లు దాటఁగలము.

కానీ, మీ తండ్రిగారు త్రిరాత్రి దీక్షతో నాహార నిద్రలుమాని, ఏక నిష్ఠచే భగవాను నారాధించుచున్నారు. నేటి సాయంత్రి లోపల, నా సర్వేశ్వరుని కటాక్షమున సువార్త రాకయుండదు.

పద్మా:- జననీ! నే నొక్కటి యడిగెద. దాచక చెప్పుము. సూర్యుఁ డస్తాద్రి చేరినవెనుక ప్రాణేశ్వరుని శుభవార్త రానిచో, నప్పుడైన నీ దేహమును చితిలో . నిడుటకు తా మనుజ్ఞ యొసంగెదరా?

సువ్ర:- అయ్యో! బిడ్డా! పతివియోగ దుఃఖమును భరింపలేవు. హృదయమున నెట్టి కోరికలు పుట్టుచున్నవి. బిడ్డా! శిరీష కుసుమగాత్రివగు నీ వగ్నియందురికిన, నే భరింపఁగలనా? నేనును నీజాఁడయే యనుకరింతును. (కన్నీరు నించును.)

(తెరలో-ఇదేనా యజ్ఞదేవునియిల్లు; ఔనౌను-ఇటుఇటు పొమ్ము)

సువ్ర:-(శబ్దమాలకించి) ఎవరక్కడ? (లేచి ముందుజూచి)
(ప్రవేశము ప్రభాసుఁడు.)

సువ్రి:- ఎవరయ్యా మీరు?

ప్రిభా:-(స్వ) ఈ కృశీభూతాంగియే పద్మావతీదేవిగా నుండవచ్చునా? (ప్రకాశముగ) అమ్మా! నన్ను ప్రిభాసుఁడందురు. ఇదియేనా యజ్ఞదేవుఁడను భూసురోత్తముని సదనము.

సువ్రి:-ఔను. మీరాక యెచ్చటినుండి?

ప్రిభా:-ఈ యజ్ఞదేవుఁడేనా జయదేవుని మామగారు?

పద్మా:-(చివాలున లేచి) ఔనయ్యా! వారిపు డెందున్నారు?

ప్రిభా:- సురక్షితముగ వింధ్యనగరమం దున్నారు. తామేనా వారి దేవేరిగారు?

పద్మా:- (విస్మయమున) ఔను. వా రిం దెప్పుడు వత్తురు? మీరు వారి నెఱుఁగుదురా?

ప్రిభా:- ఎఱుఁగుదును. వారిందు రారు. పద్మావతీదేవిగారు తామేనా?

పద్మా:- ఈ యభాగ్యురాలిని ప్రజ లాపేరనే బిలుతురు. అచటి వర్తమానమేమో చెప్పుఁడు.

ప్రిభా:- వారి దేవేరిగారు తామేనా?

పద్మా:-కాదనువా రెవరు? నేనే.

ప్రిభా:- నమస్కరింతును తల్లీ! (లోన పాలకిధ్వని వినిపించును)

పద్మా:- నాజీవితేశ్వరులవారు వచ్చుచున్నారా? త్వరగా జెప్పుము భూసురోత్తమా!

ప్రిభా:-తల్లీ! వారిందు రాలేదని మొదటనే మనవిచేసితిని గదా! అమ్మహాత్ము లందే సుఖముగా నున్నారు. మా వింధ్యరాజు గారి దేశికులై, పూజ్యపాదులై యున్నారు. వారే స్వయముగ నన్ను తమ సన్నిధికిఁ బంపినారు.

పద్మా:-(నవ్వి) ఇప్పటికి ధన్యురాలను. మిమ్మిందు బంచునపు డేమి చెప్పిపంపిరి? వారి వాగమృత ధారలఁ గ్రోలి నాకెన్ని కల్పములో యైనట్లున్నది.

ప్రిభా:-(మూట విప్పి) ఇదిగో తల్లీ! ఈ చీటీని తమ కిమ్మని సెల విచ్చినారు.

పద్మా-(దోసిలొగ్గి పుచ్చుకొని, చూచి, కన్నుల కొత్తుకొని, స్వగతము) ప్రాణప్రియా! మనోనాథా! ఇంతదయగల నిన్ను నే నెన్నెన్ని మాటలలో ప్రేలి, యింతటి యపరాధినైతిని. మన్నింపవే దయానిధానా! ఆశ్రిత చింతామణీ! (ఆనంద బాష్పములు గార్చి) ఈ యక్షర ముక్తాఫలములు, వారి హస్తశుక్తిం బుట్టినవే! ఇవి జూచిన వారిం జూచినట్టే. నా చిత్తతాపమెల్లఁ జల్లారినది. హా! (నిశ్వసించును) ఓ వ్యాకులమా! నాకడఁ జేరకుము! పరితాపమా! ఇఁక దూరమరుగుము. చిత్తమా! శాంతింపుము. ప్రాణమా! నిలువుము. ధైర్యమా! ఇటురమ్ము. లోకమా! మన కిఁక చిరస్నేహ మబ్బినది. (చీటీని చూచి)
దీనియందు "కల్యాణీ"అని వ్రాసినారు. ఈ మాట యమృత ఘుటిక. నేను వారిని, వారు నన్ను నెఱుంగుటకు మూలసూత్రమైన సంకేత మిదే. ఆహా! దీని గభీరార్థము, వారి హృదయమం దెప్పుడు విడువక తోఁచుచుండును. దీని సత్యార్థము వారిచే నొక విలాస కాలమున జక్కఁగా నెఱింగి యుంటిని. కకార, లకార, ఈకారాత్మకమై, త్రిపుటిని సూచించు, ప్రణవ పర్యాయ రూపకమగు క్లీంకారమే యిది. ఇది కామరాజ బీజముగుట, నాకోరిక యీడేరుననియు, పండుటాకుపై వ్రాయుటచే, పక్వకాలము గలిసివచ్చినదనియు, వారికి నాయందుగల యత్యంత ప్రేమాతిశయముం జూపుచు నన్నే యుద్దేశించి వ్రాసిపంపిరి. ఆహా! ఇట్లు వారిచే సంభావితనైతిని. వారు సజీవులై, సుఖులై మని యున్నవారు. ఇఁక నాకేమి కొదవ (ప్రకా) ఓ భూసురోత్తమా! కృష్ణసందేశముం గొనివచ్చి భీష్మకరాట్సుతకు ప్రాణదానమిచ్చిన యగ్నిద్యోతనునివలె నన్ను దుఃఖ సాగరమునుండి కడ తేర్చి

బ్రహ్మానంద రసాబ్ధి నోలలాడంజేసితిరి. విప్రోత్తమా! ఇఁక మీ ఋణ మెన్ని జన్మములకు దీర్చుకొనుదానను.

ప్రభా:-తమ ప్రియపుత్రునిగా నన్ను భావించిన నాకదే చాలును. ధన్యుఁడనగుదును తల్లీ!

సుశ్రీ:-(స్వ) మిగుల సంతోషమయ్యె. మా కీశ్వరానుగ్రహము నేటికి కలిగినది. మావారి దీక్ష సఫలమైనది. ఈ కుశలవార్త నెటిం గించి వారి నిటకుఁ దోడ్కొనివత్తు. (నిష్క్రమించును.)

పద్మా:-మంచిది. ఇఁక లెమ్ము. వింధ్యనగరమున కిప్పుడే వెడలుదము. వారి దర్శనభాగ్యము తమకు సిద్ధింపలేదని నా నేత్రము లూరక జాలిఁబడి బాష్పవర్షమును గురిపించుచున్నవి. హృదయమున కౌతుకము చిగురించి, త్వరసేయుచున్నది. కాళ్లు నడువ నుత్స హించుచున్నవి.

ప్రభా:-అమ్మా! ఆ నగరము చేరువనులేదు. రేయింబవళ్లు నడచిన మూఁడు దినముల ప్రయాణము. తాము నిరాహారులయి కృశించి కడుంగడు బడలినారు. నడువఁజాలరు.

పద్మా:-మఱియెట్లు?

ప్రభా:-నేడు పారణఁజేసి కొంచెము విశ్రమించి రేపు వేకువజామున ప్రయాణము సేయుదము.

పద్మా:- అయ్యా! పారణ నీవు చేయుము. మా తండ్రియు నిప్పటికి త్రిరాత్రి దీక్ష జాలించి, పారణసేయ నుపక్రమించినారు. మీరు మొదట స్నానము గావింపుఁడు.

ప్రభా:- ఇదిగో వెళ్ళుచున్నమ్మా (నిష్క్రమించును)

యజ్ఞ:- (సుశ్రీతతో ప్రవేశించి) అమ్మా! భగవానుని యనుగ్రహమున మనకిపుడు జయదేవుని కుశలవార్త తెలియ వచ్చినది. ఇది విని నా వ్రతమును జాలించితి. భగవంతుఁడే ప్రభాసుఁడై పారణకు మనయింటికి వచ్చియున్నాఁడు. "అభ్యాగత స్స్వయం

విష్ణుః” అనికదా ఆర్యు లందురు. నీవును రమ్ము. పారణ సేయుదము.

పద్మా:- తండ్రీ! నా విభుని హస్తాబ్జమును స్పృశించి వచ్చిన యీ శుభపత్రపుటము చూడగనే, నా నేత్ర భ్రమరములకు విందైనది. అందు నాప్రియుఁడు నింపియున్న వాక్సుధ నాస్వాదింపగనే, నా హృదయమునకు పారణమైనది. ఈ యపూర్వామృతము నాకు సంతుష్టి గలిగించినది. నాకిపుడాఁకలి దప్పులు లేవు. శరీరమునకు మిగుల జవసత్వములు వచ్చినవి. ఇఁక నే నిందొక నిముసమేనియు నిలువనోప. ఇపుడే నా ప్రాణవల్లభుఁ జేరంజనుదు. ఇందుకు మాఱు చెప్పిన నాయాన సుమా!

యజ్ఞ:- (స్వగతము) ఆహా! ఇంకేమి సేయుదును? బెట్టిదముగ నొట్టు బెట్టుకొననే! ఔను-వియోగ బాధచే ప్రాణము లపుడే వీడునదియై యుండె. ఇంతవఱకు నిల్చినదే అతిశయము. ఈమె నిశ్చయ జ్ఞానమూ-దృఢమై, యచంచలముగ నున్నది. ఇట్లే యుందురు కాబోలు భూలోకమున మహా పతివ్రతలందఱు! (ప్రకాశముగ) అమ్మా! నీ వింత గట్టిపట్టుఁ బట్టిన నిను వారించువా రెవరు? ఇఁక నీ యిష్టము. నీవును నీప్రియుఁడును, సుఖముగ మఱలివచ్చినపుడె మిమ్మిరువురను వస్త్రాభరణాదులచే సత్కృతులఁ జేయుదును.

పద్మా:- చిత్తము తండ్రీ! పోయివత్తును. (నమస్కరించును)

యజ్ఞ:- దీర్ఘ సుమంగలివియు, సుపుత్రవతియు, సుఖివియు, నగుము తల్లీ! (ప్రక్కనజూచి) అయ్యా! ప్రభాస భట్టారకా!

ప్రభా:- స్వామీ! యిదే వచ్చితిని.

యజ్ఞ:- మా తనయ పద్మావతి యిపుడే ప్రయాణమై యున్నది. నీవీ సుకుమారిని జాగ్రతగా దోడ్కొనిపోయి, భర్త సన్ని

ధానమున జేర్పుము. ఒకతూరి వారిరువురం ద్వారగా నింతవఱకు నరుదెమ్మని వేడితినని, నా మారుగా నీవు నా అల్లుండుగారితో విన్నవింపుము.

ప్రిభా:- చిత్తమయ్యా! అటులనే మనవిచేసెదను.

పద్మా:-తల్లీ! పోయివత్తును. ఇంక సెలవిప్పించుము. (నమస్కరించును)

సువ్రి:- నా ముద్దుబిడ్డా! పొమ్మనుటకు నా నోరాడకున్నను నీ పతి కొఱకై నీవు పడిన యిడుమలం దలంచిన, ఆగుమమ్మా యని చెప్పుటకు పెదవులు గదలకున్నవి. మన సొప్పకున్నది. కాని, అమ్మా! యీ నిరశనవ్రితమున నుండియున్న నీ విట్టులే వెళ్ళుదువా ?

పద్మా:- ఔను జననీ! నీ వేలాటి సందియ మొందకుము. నేను వారి సన్నిధిం జేరువఱకు, నీ శరీరమున కేయుపచారముం జేయందగదు. సెలవిమ్ము.

సువ్ర:- మంచిది. బిడ్డా! సుఖివై నీ కడుపు చల్లగ, కుమాళ్ళ కుమార్తెల తల్లివై వర్ధిల్లుము. శీఘ్రిముగ మఱల వచ్చి మీ రిరువురును, మా కన్నులకఱవుం దీర్పుండు.

పద్మా:- అయ్యా! భూసురోత్తంస, నీకు పారణమైనదిగదా, మఱి త్రోవజూపుదువు రమ్ము. వైళమ వెళ్లుదము.

ప్రిభా:- (స్వగతము) ఔరౌరా! ఈ దేవిగారి హృదయ మెంత దృఢమైయున్నది. ఎవరెంత చెప్పినను వినదయ్యె. తుదకు మంచినీరేని పుచ్చుకొనదు. ఎత్తు పయనముల నున్నది. (ప్రికాశముగ) అమ్మా! మంచిది. తమకై వింధ్య ప్రిభువు నా వెంట పాలకిని పంపియున్నారు. వాకిట సిద్ధమైయున్నది. అది యెక్కుడు.

పద్మా:- (చిఱునగవున) అన్నా! యెంతమాట! నా విభు సన్నిధికి నే పాలకిపై నూరేగుటయా? ఆహా! ఇది యెంత బాగుగానున్నది.

ప్రిభాసా! అది కానిపని. నేనెక్కను. నడచియే పోవలె. ఏయానము నేనెక్కను. ముందు నడువుము.

ప్రిభా-(స్వగతము) ఇంక గట్టిగా జెప్పకున్న సరిపడదు. (ప్రకాశముగ) తమ చిత్తవృత్తి యెట్లున్నను, తల్లీ మా తలలు కాపాడుటకైనను దయయుంచి తాము పాలకి నెక్కవలయు. సుదర్శన మహారాజు గారును, వారి రాణిగారగు కళావతీదేవిగారును, అయ్యగారి సన్నిధినే, మాకు నిష్కర్షగా తమ్మును పల్లకిపై నెక్కించుక రమ్మని యాజ్ఞ నొసంగినారు. తామట్లు చేయకున్న, మేమచటికి వెళ్లగనే రాజు మా యందఱి తలలం దీయించును. మా ప్రాణరక్షణకైనను, మా ప్రార్థన నంగీకరింపక తప్పదు తల్లీ! (చేతులు జోడించుకొనును)

పద్మా:- అటులైన, నిది నావిభున కభిమతమేనా?

ప్రిభా:- ఆహా! వారును సమ్మతించియే పంపిరి. ఇందులో సందియమేమి?

పద్మా:- కానిమ్మైన ముందు నడువుము.

ప్రిభా:-చిత్తము (స్వ) అమ్మగారు వచ్చుచున్నారను నుదంతమును, రాజుగారికి ముందుగా జెప్పి పంపెద. మధుసూదనునిచే నీవార్త యిప్పటికి, మధువనమునందున్న ధనదగుప్తునకు చేరియుండును. (నిష్క్రమణము.)



4 వ అంకము. 4 వ రంగము.

వింధ్యనగరము

(జయదేవుని మందిరము. ప్రవేశము జయదేవుఁడు)

జయ:- (స్వగతము) ప్రిభాసుఁ డంపిన బ్రాహ్మణుఁడు వచ్చి చాల ప్రొద్దైనది. ఏల పద్మావతి యింకను చేరలేదు? మార్గాయాసమున

నెందైన నిలిచియుండురా? అకటా.

తే॥ గీ॥ ఎంత కఠినుఁడ నకట నే నెంత జడుఁడ;
దలపనైతిని నాదు కాంతాలలామ;
నా చిగురు బోఁణి, నాసాధ్వి నాదుప్రాణ
మహహా! నను బాసి యెట్లు దేహంబుఁదాల్చె

ఉ॥ ఎంత కృశించియున్నదియొ యిందునిభానన నన్ను బాసి; తా
నెంతటి మర్వ్యథంబడెనొ, యేడ్చెనొ, కుందెనొ, యెట్టు లోర్చెనో?
యింతకు వేగ వత్తుననియే వచియించితిఁ; బోవనైతి; ని
శ్చింతగఁ నిందె యుండితిని; చేడియ నెంతయొ కష్టపెట్టితిన్

ఏదీ నా ప్రాణనాయకి పద్మావతి (అని లేచును)

పద్మా:- (ప్రవేశించి) ప్రాణేశ్వరా! యిదే తమ దాసి నమస్కరిం
చుచున్నది.

జయ:- కల్యాణీ! నీకు నిరంతర శుభమగు లెమ్మ (చేతితో లేవనెత్తి)

మ॥ తరుణీ! ఎంతయు డస్సినా వబల! డెందంబందు నన్నెప్పుడున్
స్మరణం జేయుచు నా సమాగమ మె యశ్రాంతంబు గాంక్షించుచుం
స్థిరమౌ నుగ్రతపంబునన్ దనువు శోషింపం వగం బొందితే?
అరుదై దోఁచెడి; నీదు కష్టమున కాహా! మూల మేనై తినే

సతీ తిలకమా! (స్వగతము) అయ్యో! వెక్కి వెక్కి యేడ్చుచున్నది.
దీని నెట్లోదార్తు (గడ్డము బట్టుకొని)

చం॥ పొగలకుమోకృశాంగి, వగపుం దలపోయకు పువ్వుబోఁణి; కెం
దొగలను బోలు నీ కనుల దొరపు బాష్పము లేలజాలనో
సుగుణవతీ తనూలతిక సుక్కి కడుంగడు జిక్కిపోయెనీ
వగపును జూడజాల; మగువా! మది నూఱటఁ బొందఁ గోరెదన్

పద్మా:- జీవితేశ్వరా! నన్నేల యీ తనాదరణఁ జేసితిరి. కనికరపు
గనియగు తాము, నిర్దయుం నన్ను బాసి, యింతకాల మిందేల
తడసితిరి? హా! (నిట్టూర్పు విడచును)

తే॥ గీ॥ అక్కటా యిదె వచ్చెద మంచు జెప్పి
మఱల రావైతి రొక్క సంవత్సరంబు;
తప్పు నేనేమి చేసితి? దయను మాని
నను వియోగాగ్నిఁ గాల్ప నొప్పెనె మనంబు
ప్రాణనాథా!

మ॥ తమకై నే జొఱకున్న దేశములు కాంతారంబులుర్వీ దుర్గముల్
గమనార్హంబు లవేవిలేవు; వినుమో కాంతా! నిరాహార దీ
క్ష మతిన్నిల్పి చరించి మిమ్ము నెచటం గానంగలేనైతి; మీ
విమలార్ద్రాత్మకమైన పత్రమదె చూవే త్రిప్పె నా ప్రాణముల్.

జీవితేశ్వరా! తాము మధువనమునుండి, మన యూరికి రాకపోయితి
రేల? ఒక వేళ తామీ నగరమునకు రానెంచినను నప్పుడే నా
కొక్కమాట వ్రాసిపంపం దమకుఁ దోపదయ్యె నేల? అట్లు
చేసియున్న మీ దాసికి ప్రయాసమెల్లం బాసియుండు గదా?
నే వినఁదగుదునేని, తామట్లు సేయమికి హేతువేమో సెలవిండు.

జయః- అలివేణీ! నీవు వినరాని దేమున్నది. (యోచించును)

పద్మాః- అట్లయిన నేమి యోచన? (జయదేవుని ముఖముజూచి)
ఆహా! ఏమి తమ ముఖము వివర్ణమైనది. చెప్పుటకు సంకోచించు
చున్నారేల? అయ్యో!

చం॥ అరమర లేని కూరిమికి నాపదవచ్చెనె? యెన్నడేని నన్
మఱవని మీరలిట్టు లనుమానమునం నను జూడనేల? యే
పొరపును లేని మీ మనము పొల్పెఱియున్న దిదేల? నేడు న
న్నరతెఱవం బొనర్చె విధి నేటికి కాలము నాకు చాలమిన్.

ఇంత నిర్దయ, యిట్లేల నాపై గలిగె. ఎన్నడేని మీ మాట నిసుమంత
యేని జవదాటి యుంటినా?

జయః- నీవటు దలంపకుము. సాధ్వీశిరోమణీ! నేజెప్పకపోను గాని,
యది జెప్పుట కిది సమయముకాదు గనుకనే.

పద్మా:- ఇందు పరులెవ్వరును లేరు. సమయ మేలకాదు? తామిం చెప్పక యోచించుకొలఁదిని, నా చిత్తము పరిపరి విధముల బోవుచు, తామరాకులోని నీటివలె దలకుచున్నది. శీఘ్రిముం దయయుంచి చెప్పుఁడు. (స్వగతము) ఇంత యోచించి చెప్పవలసిన విషయ మేమియుండును. "బడలి యున్నావు. చెప్పుటకిది సమయము కాదు" ఇట్లనుటచే నేవిని సహింపజాలనని స్ఫురించుచున్నది. నాథా! అట్టి కఠినమగు మాట యేమియుండును (ప్రకాశముగ) నాకేమో భయమగుచున్నది. స్వామీ! నాభయము శీఘ్రిముగ తీర్చరాదా? జాగేల?

జయ:- (నిట్టూర్పు విడచి స్వగతము) చెప్పకున్న విడువదు. చెప్పితినా యిప్పు డీమెయుండు దుర్బలస్థితిలో, ప్రాణములే నిలువఁ జాలవు. నేనేమి సేయుదును? (ప్రకాశముగ) భయపడకుము సతీమణీ!

తే॥ గీ॥ ఇడుమలన్నియుఁ దొలఁగెనో యిందువదన
మనకు సుఖపడు కాలంబు మఱల వచ్చె;
నాకు తల పోవునట్టి గండంబుఁ గాఁచి
ఈశ్వరుఁడు కాలుసేతుల నిచ్చె నాకు.

పద్మా:- హా! హా! హా! ప్రాణప్రియా!

ద్వి॥ తలపోవునంత దుర్దశ వచ్చినపుడు
తలకితో? నన్నెంత దలఁచితో? దేవ!
కాలుసేతులు పోయెగా నీకు నాథ! (కాళ్లు చేతులు తడవును)
ఏల నా పాలు నా కీవైతివందు
ఏరీతి నోర్చితి వెంత కష్టంబు
ఘోరంబు; పాపంబు కూడెనా మనకు (అని మూర్ఛ)

జయ:- (దగ్గఱి, చేయివేసి) పద్మావతీ! సతీమణీ! (స్వగతము) ఆహా! మూర్ఛపోయినది. ఇంకేమి సేయుదు. (తొడపై తల నిడుకొని నిట్టూర్పు విడిచి)

సీ॥ చెప్పిన నిట్టి దుస్థితి గల్గుననియె నే
జెప్పక జాగు చేసితిని చాల
జాగు చేయుకొలంది సందేహమే హెచ్చి
తొందర చేయంగఁ దొడఁగె నబల
విధిలేక తుదకు నా విధమింత జెప్ప, నీ
వనితకు మూర్ఛయే వచ్చె నకట!
దీని నెవ్విధమునఁ దేర్పఁగా వలయునో?
కాల్సేతులాడ వే గతియొ యింక?
ఆ॥ వె॥ నుపవసించి బడలియున్న యీ మానిని
కీ యవస్థ గలుగు టెంచిచూడ
పచ్చి గోరుచుట్టుపైన రోకటిపోటు
తగిలినట్టులయ్యె దైవగతిని
హా! దైవమా! నేనేమి చేయుదు? చింతిల్లుచున్న నేమిగతి?
(విస్మరించి)
సీ॥ విసరుదునా తాళవృంతంబు చేఁబూని
హృదయతాపంబంతఁ బొదలునొక్కొ
చల్లని పన్నీరు జల్లుదునా మేన
కాగు నెమ్మేన నిక్కాక యగును
చిక్కని గంధంబు మక్కువఁ బూతునా
పొక్కి పెన్బొబ్బలు పోవు నొక్కొ
కమ్మ పుప్పొడి మేన కలయ నూదుదునా కృ
శాంగి యీ బరువు మోయుఁగ గలదె
తే॥ గీ॥ వలదిఁకేవియు దీని దీర్పంగ నాదు
నిశ్వసన బాష్ప పరిరంభ శశ్వదీక్ష
నములచే నిప్డు డీ శోషణంబు వాయు
సంశయము లేదు, కాలంబు జరుగరాదు

కాని, సాధ్వీరత్నమా! ప్రాణేశ్వరీ! (లేపి కౌగిలించును)

పద్మా:- (కనులు తెఱచి, హీనస్వరముతో) నాథా! హా! నేనెంత కష్టాత్మను.

జయ:- అట్లనుకొనకుమో రమణీ!

ఉ॥ నీవు మహాపతివ్రతవు, నీ సుకృతంబు సునిశ్చయంబు, స
ద్భావము దైవభక్తియు శుభంబొసగె న్మన; కెల్ల రీతులన్
దైవము తోడ్పడెన్; వగపుఁ దక్కుము; యున్నవి కాలుసేతు లో
దేవి! లవంబును న్జెడవు; ధీరమతింగని యూఱడిల్లుమా.

పద్మా:- (చూచి - లేచి - కూర్చుండి) సాధు హృదయా! హృదయేశ్వరా!

చం॥ ఎవరికి కీడుసేయ మది నెంచవు, గట్టిగ మాటలైన నా
డవు, నిరత ప్రశాంతుఁడవు, టక్కులెఱుంగవు, నిర్మలాత్మ! నీ
కెవఁ డపకారమెంచె నెడ రేటికి బుట్టె నిదెట్లు చేసుతన్?
వివరముగా వచింపఁగదవే వినఁగోరెద ప్రాణవల్లభా!

జయ:- కలవాణీ! అవశ్యముగా జెప్పెద గాని నీ విపుడు కడుం బడలియున్నావు. వైళమ భోజనంబొనర్చి సేద దీర్చుకొన్న, సావధానముగ నంతయు పూసఁగుచ్చినట్లు చెప్పెదను. ఇప్పటికి లెమ్మా.

పద్మా:- ఔనౌను. నేనెంత మైమఱచి పోతిని. తమకు భోజన సమయంబైనది. భోజనశాలకు వెళ్ళుదము. వేంచేయుడు.

[ఇద్దఱు నిష్క్రమింతురు]



జ య దే వ మ ం ది ర ము.

(ప్రవేశము: పద్మావతి)

పద్మా:- ఆహా! నా జీవితేశ్వరుఁడు పడిన యిడుములం దలంచిన నా చిత్తము, విక్షుబ్ధమగుచున్నది. కటకటా! బాడిబెంట వచ్చిన పరిచారకులెంత కఠిన కర్ములు. కపిలధేనువు కంఠ ముత్తరించు కటికలుం గలరా? ప్రాణికోట్ల నాత్మ సదృశముగఁ దలఁచి, దయఁజూపు ప్రాణవల్లభుని కర చరణములు—హా! హా! స్మరింపఁజాల. ఎట్లైన నేమి? తుద కిడుములన్నియుం దీరినవి. ఈశ్వరానుగ్రహము మాయెడ సంపూర్ణముగ నున్నది.

తరళ వృత్తము.

విభుఁడు న న్నెడబాసియుండిన వేళయంతయు నా జగ
త్ప్రభు కటాక్షముచేఁ దొలంగెను స్వప్నమట్లు క్షణంబులో;
శుభమునొందితి స్వామిసన్నిధిఁ జొచ్చితిన్ నిజమెన్నగా
నభయమూ నెడ కాంతకెప్పుడు ప్రాణనాయకు ప్రాపెగా

దాసి:- (ప్రవేశించి) దేవీ! సుదర్శన మహారాజుగారి దేవేరి కళావతీదేవిగారు తమ సన్నిధికి రానున్నారు. సెలవే?

పద్మా:-ఆటంకమేమి? అవశ్యకముగ రమ్మను మమ్మా!

దాసి:- చిత్తము. (నిష్క్రమించి, కళావతితో ప్రవేశించును)

(ప్రమద, మంజువాణియు ప్రవేశింతురు.)

కళా:- (తట్టలో ఫల పుష్పము లుంచుకొని పద్మావతియొద్ద నుంచి) అమ్మా! నమస్కరించెద.

పద్మా:-దీర్ఘ సుమంగలీ భవ. అమ్మా! కూర్చుండుము.

కళా:- (కూర్చుండి) అమ్మా! నాచిత్తము తమ సన్నిధినే యుండును. ఇచ్చటికి వచ్చుటకుఁ గల యుత్సాహము నా

కేపనియందు నుండదు. ఇది నా యందు గల ప్రేమాతిశయముచే నని తలంచెద.

పద్మా:- అంతయే కాదు? నీకు నాయందుగల భక్తి విశేషమును సముచితము సూచించుచున్నది. నీ చిత్త మచిరకాలమందే పరిశుద్ధతఁగాంచు. సంశయింపకుము. నీయట్టి సుకృతాత్ముల నీధరం గాంచుట కడుంగడు నరిది.

ఉ॥ మానవజన్మ మెత్తుటయు మానవతీమణియై వ్రతంబుగా
ప్రాణవిభుం బరాత్పరునియట్లైద నిత్యము నమ్మి గొల్చుచున్
హీనములైన వాసనల నెల్లను మాని స్వధర్మమూని సం
తానము భాగ్యముల్ గలిగి ధన్యతనొందుట యెంతవారికో?

కళా:- అమ్మా! మఱియొక మాట. ప్రాణవిభుఁ డెదుటనున్న సేవింతుము గదా! వా రెందేని కార్యాంతరాసక్తిచే, ప్రవాసము నందున్నపుడు, మన మేమిసేయవలెనో సెలవిండు.

పద్మా:- మహా భాగ్యవతీ! వినుము.

ప్రమ:- (మంజువాణితో) ఓసీ మంజువాణీ! దేవిగారి ప్రశ్నకు సదుత్తరము శ్రద్ధగ మనమును విందము.

మంజు:- నిజము. గురుపత్ని, యిందులకేమి ప్రత్యుత్తరముఁ జెప్పునోయని నేనును వేచియున్నాను.

పద్మా:-

చం॥ పతి తను బాయుచో నతివ పల్కదు మెండుగ నేరితోడఁ; దా
సతతము భర్తనెంచుచును సల్పుచు వర్తిలు గేహ కార్యముల్;
స్థితి వితతంబుగాఁ దలచి సేయదు మజ్జన భోజనాదులన్;
శృతమతి నట్టివేళ గయిసేయదు వేదురుభంగి గ్రుమ్మరున్

మంజు:- (ప్రమదతో) ప్రమదా! వింటివశే, అమ్మగారి అమృత వాక్కులు. బహు చక్కగా సెలవిచ్చిరి.

ప్రమ:- ఏమో పోవే! ఆ మాటలు నాకర్థమే కాకున్నవి.

దాసి:- (ప్రవేశించి) దేవీ! ఈ జాబు తమ కిమ్మని ప్రభువుగా రంపిరి.

కళా:- దాసీ! ఇటు తెమ్మా

దాసి:- (జాబిచ్చును)

కళా:- (జాబువిప్పి చూచి) అయ్యయో! ఇంకేమి గతి?

మంజు:- ఏమది తల్లీ! ఇట్లనెదరు?

పద్మా:- కళావతీ! అందేమి వర్తమానమున్నది? ఎవరు వ్రాసిరి? చింతింపక ధైర్యముగా జెప్పుము.

కళా:- ఇంకేమని చెప్పుదును తల్లీ! నాకిఁక ధైర్య మెట్లుండఁగలదు? అమ్మా! నా తోఁబుట్టినవాఁడు, స్వ-స్వ-స్వర్గస్థుఁ డయ్యెనట!

మంజు:- అయ్యో! ఎంతమాట

ప్రేమ:- ఏమి కాలమమ్మా!

కళా:-

తే॥ గీ॥ నన్ను కడు గారవించు మాయన్న! అకట
నన్ను విడనాడి పోయితే; అన్న! అన్న!
ఎన్ని జన్మాలకైన నా యన్న వంటి
సుగుణ భూషణు నెందైనఁ జూడఁగలనె?

పద్మా:- అయ్యో! పాపము. అతఁడంత మంచివాఁడుగా! "పాపీ చిరాయుః, సుకృతీ గతాయుః" కదా! అమ్మా! మంచి పండునే కదా మనుజులు కోయుట. మీ తలిదండ్రుల కెందఱు పుత్రులు?

మంజు:- }
ప్రేమ:- } ఒక్కఁడే నమ్మా!

కళా:-

ఉ॥ తానొకఁడే గదమ్మ తలి దండ్రులకుం దనయుండు; వారలన్
దా నిలఁ దోఁచి మున్నరిగె తల్లిరొ! ఇంకెటు సైతురమ్మ వా
రేనెటులోర్తునమ్మ జనియించిన యింటికిఁ బోవు నాశయుం
మానిపె నాకహా! విధి ప్రమాద మొనర్చె నిఁకేమి సేయుదున్.

ప్రిమ:- ఇంకెక్కడి పుట్టింటి యాశ? ఆ యాశ నేటితోఁ దీరినది.

కళా:-హా! ఏమి దయాళుఁ డెంత బాంధవ ప్రీతిఁగలవాఁడు!

ఉ॥ ఏమి మనంబు మెత్తనయు నేమి గుణంబు నయంబు బాంధవ
ప్రేమము దైవభక్తి రిపు భీకర విక్రమ మిట్టివెల్ల న
య్యో! మహిలో దలంచుకొనుచుండగ మమ్మిట నిల్పిపోయె
మ్మా! మముబోటి పాపులకు నట్టి సహోదరుఁ డుర్విఁ దక్కునే?

పద్మా:- ఇది యంతయు సత్యమే. కాని విధికృతమునకు, మనము చేయునదేమి? ఊఱకుము కళావతీ! విపత్కాలమున ధైర్య మూనవలయు. అటు సేయక యూరక వగచిన నేమి ఫలము? జగమునం గల ప్రాణికోట్లన్నియు "జాతస్య మరణం ధృవ" మ్మని, తుదకు మృత్యువు వాతఁ బడక తీరదు. కావుననే, పెద్దలు జగ మసత్య మందురు.

ఉ॥ ఎక్కడి తోడఁబుట్టువు? లదెక్కడి బాంధవులమ్మ? మిన్నకే
స్రుక్కెద వొక్కమాట వినుఁ;చూడఁగ యోగ వియోగముల్గలల్
నిక్కము గావు కర్మబల నీతములై కలుగు న్విమోహముల్
దక్కుము, చింత నొందకుము, ధైర్యముఁ బూనుము మానినీమణీ!
వ్యాకులపడకుము. ఆజాబును సాంతముగా నైనఁ జూడుము. ఆతురపడ నేమిఫలము? ఆజాబును మఱల నిదానించి చూడుము.

మంజు:- దేవి! ఆకమ్మను నెమ్మదిగా చూడుము.

కళా:- అయ్యో! ఇంకేమి జాబు! ఆ జాబును నే ముట్టఁజాల. మీరే చూడుడు.

ప్రిమ:- తామైనను చదివి, సాంతముగా నంతయుఁ జెప్పుడు తల్లీ!

పద్మా:- (జాబుపుచ్చుకొని, చూచి, తలయూచి) అతడు పోవుట నిజమే. పాపము. ఏమీ? వారి భార్యయు-

కళా:- మఱే మున్నదమ్మా?

పద్మా:- (జాబు క్రిందనుంచి) ఆతనివెంట నామెయు సహగమనముఁ జేసినదట.

మంజు:- అయ్యో! కొంప గూలిపోయె

ప్రేమ:- సహగమనమా?

కళా:- హా! హా! మా వదినెగారును బోయిరా? ఇరువురు కొంప ముంచిరి. వారికొక బిడ్డఁ డున్నాఁడమ్మా! వానికి తలిదండ్రుల కలఁ వప్పుడే కలిగెనా? అయ్యో! నా కసుగంద నైనం జూడక మావదినె యెంత సాహసముఁ జేసినది. ఆమెనిశ్చయ మెంత దృఢమైనది. ఎట్టి పతివ్రత! పతివ్రతయన నామెకే చెల్లును.

పద్మా:- ఔను.

కళా:- ఆమె యెంత ధన్యురాలమ్మా!

చం॥ పతి కనురక్తయై పరమ పావనవృత్తిఁ జరించె; భూమిపై సుతుఁగని
వాని ముచ్చటయు జూచి కృతార్థత నొందె; నంత ప
త్పతి మృతి నొందఁగా నతని స్వర్గ పదమ్మునఁ జేరఁదాను; స
మ్మతిపడి; ఎంత పుణ్యవతి మానిని? తాదృశు లన్యు లుందురే?
తుద కింతయేగదా సాధ్వీమణి పరివర్తన!

తే॥ గీ॥ సతులు చేయంగఁ దగినట్టి స్వచ్ఛధర్మ
మంతియేకద! మృతుఁడైన యాత్మ భర్త
తనువుతోడనె తన మేనుఁ దగులఁ బెట్టు
కొను టదెంతటి సాహసం బనఁగవలయు?

పద్మా:- ఔను. అదియు సాహసమే!

కళా:- ఔరా! ఎంతటి పతిభక్తి!

ఉ॥ ఎంత విరక్తమైన మతి? యెంతటి నిశ్చయ? మేమితెంపు? కా
సంతయు కన్నబిడ్డపయినైనను మక్కువలేక, భీతి యా
వంతయు నొంద కందఱిని బాసి స్వబుద్ధి పురస్సరంబుగా
సంతతమార నాథు చితి చయ్యనఁజొచ్చె చలింప కాత్మలోఁ

పద్మా:- (తలయూచి) నిజమే. అదియు సాహసమే!

ప్రేమ:- (మంజువాణితో) ఇదేమే? మంజువాణీ! పద్మావతీ దేవి గారి మోము నిర్వికారమైనది. చూడు చూడు.

మంజు:- (చూచి) ఔనే! అటులనే కనపడుచున్నది.

కళా:- ఏమమ్మా! తమ భావము చూచిన, నిది యొక యల్ప విషయమని దలచినట్లు తోచుచున్నది. నిజముగ తామట్లే తలంచితిరా?

పద్మా:- నీవు బిట్టుగా వాపోవుటఁ జూచి, నే నేమియు ననజాల కూరకుంటినిగాని, నిజమున నా యభిమత మది గొప్ప విషయము కాదనియే.

మంజు:- ఏమే ప్రమదా! అమ్మగారి మాట వింటివా? సహగమన మొక గొప్పవిషయము కాదట!

ప్రమ:- ఇంతకు మించిన గొప్ప విషయము జగతి మఱేముండును?

కళా:- ఆలాగా! అదెట్లు? మర్మము విడిచి చెప్పుడు. నేనును విందును.

పద్మా:- మహా పతివ్రతలకు సహగమనము నీవు చెప్పునట్లు సంభ వింపదు. ఇదే యిచట పరమ రహస్యార్థము.

కళా:- దాని యర్థమేమో చెప్పుడు.

ప్రమ:-

కం॥ సతియుఁ బతియును నేకా
కృతియగు కరణత్రియ ప్రవృత్తి గలుగుటఁ
పతికి మృతి గల్గునప్పుడె
సతికిఁ గల్గు నది; యిందు సందియ మేలా?

ఇదియును గాక, యిందుకు మఱియొక యుదాహరణము జూపించెద.

చం॥ పతి పరలోక మొందిన స్వభావమునం సతి నిక్కమౌఁ పతి
వ్రతయగు నేని, తత్క్షణమె పాయు శరీరము; చంద్రుఁ డ స్త ప
ర్వత గతుఁడైన వెన్నెలయు గ్రక్కున తోడనె పోవుఁగాక, యే
కతమున నైన నొక్క త్రుటికాలము నిల్చునె యొంటి నిమ్మహిన్.

కావున, నిజ పతివ్రత తన పతి ప్రాణము లరుగునపుడే, తన యసువులఁ ద్యజించు. నిముసమేనిఁ దడయదు. ఇది నిజముగు పతివ్రతా మహిమ.

మంజు:- ఓహో! ఆలాగా! ఇది మిగుల గంభీరార్థము.

ప్రేమ:- ఇది మెంత వింతగా నున్నదమ్మా! ఈ మాటలయందు సత్యముండునని నాపుత్రికెక్కడున్నదే?

కళా:- ఎంత యబ్బురముగ సెలవిచ్చితివమ్మా? అట్లైన లోకమున నిట్టి పతివ్రత లెందైన నుండుట వింటిమా? కంటిమా? సరిసరి. (తలయూచి, యోచించి) మంచిది. తల్లీ! నాకు సెలవిమ్ము. నేవెళ్లి స్నానము చేయువలసి యున్నది.

పద్మా:- అమ్మా! పోయి రమ్ము. ధైర్యముగా నుండుము. వంత మానుము. సంతకూటమువంటి సంసర్గమునకై, వ్యర్థముగ చింతింపరాదు. కావుననే నీ విభుండీ వ్యసన మపనయించు కొనుటకని గదా, కార్యాంతరుఁడై మావారితో కలిసి వనవిహారము వెడలియుండుట. నీవును నారీతిగనే, కార్యాంతరాసక్తిని నుండుము.

కళా:- చిత్తమమ్మా! చిత్తము. పోయి వచ్చెద (నమస్కరించును.)

పద్మా:- సుఖముగా నుండుము. పోయిరమ్ము.

కళా:- (పోవుచు) నే నీ యర్థమును నా చెలులతోఁ గలిసి, యోచనా మందిరమును జేరి, యోచించెద. (ప్రకాశముగ) సఖులారా! ఏమి? అంత వెనుక జిక్కితిరి. నడచి రాజాలరా?

ప్రమ-మంజు:- ఇదిగో వచ్చితిమమ్మా! (నిష్క్రమింతురు)



5 వ అంకము. 2 వ రంగము.

యోచనా మందిరము.

(ప్రవేశము కళావతి, మంజువాణి, ప్రమద)

కళా:- ప్రాణసఖులారా! వింటిరా!

ఉ॥ నమ్మెడువారలున్న లలనామణులార వచింపరాని వా
క్యమ్ములు గల్గవే ధరణి; గట్టి పతివ్రత లక్షణంబుగా
నమ్మకచెల్ల! శ్రీ గురువరాంగన ప్రొద్దున బల్కినట్టి వా
క్యమ్ములు వింటిరే? ఎచటనైన పతివ్రత లట్టులుందురే?

ప్రమ:- ఔను దేవీ! నామట్టు కా మాట లేమియు, వినసైప రాకుండె

మంజు:- మీరనునది సరే కాని, మన బుద్ధికి నసాధ్యములుగాఁ దోఁచునవి, లోకమున నుండరాదా? లోకమున నున్న మహా పతివ్రతల నెల్ల మనము పరీక్షించి చూచియున్నామా? ఏ పుట్టలో నే పామున్నదో, యెవ రెఱుంగ గలరు?

కళా:- పరీక్షించి చూడవలెనా?

ఉ॥ నీతులటంచు నన్యులకు నిత్యము బోధ లొనర్చుచుండు ని
ర్ణేతల నైజవృత్తి గమనించి కనుంగొన వారు చెప్ప నా
రీతులు సాధ్యమాట విపరీతము లౌటయు నేర్పడుంగదా
చూతము మంచి దాయమనె శోధన జేతము వాదమేటికిన్

మంజు:- దేవీ! ఆమె నెట్లు శోధింతురు. ఆమెగారి పాతివ్రత్యమునకు సాక్షి, యామె పతిని బాసియున్నకాలమున నుండిన యునికియే చాలదా? అరచేతి కంకణమ్మున కద్దమా?

ప్రమ:- అది మన మెఱుంగమటే? దేవిగారి యభిమత మటుగాదు.

మంజు:_ మఱి యెట్లు?

కళా:- చెప్పుమందువా? వినుము. వారి పతి లోకాంతరగతుఁ డయ్యెనని-

మంజు:- (చెవులు మూసికొని) హా శ్రీహరీ! ఎట్టి మాటాడితివమ్మా! ఇంతటి పాపపుమాట లనుటకు మీ నో రెట్లాడెనమ్మా? హా యెంతమాట! ఎట్టి అసత్య కల్పనము! అమ్మహా సాధ్వీమణి యెనుట, సత్యుని పెదవులు కదల్చి చెప్పుట కెవరి తరము? వలదమ్మా! వలదు. తమరీ తలంపును మానుట మిగుల క్షేమము.

ప్రియ:- ఎంతటి పిఱికిపందవే? మేలమున కాడు మాటలకు దోసమట! మోసమట! (చేయి త్రిప్పును)

కళా:- ఏటికే భయపడెదవు? మాటమాత్రమున నెవరికేమి ప్రమాదము?

మంజు:- అయ్యో! అయ్యో! అట్లనఁ దగదమ్మా! ఏమి ప్రమాదము గల్గునో? ఒకవేళ యేదేని విపత్తు మూడిన వెనుక గతియేమి? దేవీ! నాకేమో భయము. చేతులు కాళ్లు వడకుచున్నవి. (కాళ్లు వణకించును)

ప్రియ:- మంజువాణీ! నీమాట నిజమే నే! యోచించు కొలదిని మనస్సులో దిగులగుచున్నది. ఈశ్వరానుగ్రహమున, నెవరి కేకీడు మూడకుండిన సరే! అటుగాక దైవము విపరీతమైన యోచనీయమే.

మంజు:- ఆవల యోచించు టేమే? నవ్వులు నువ్వులగును. వలదమ్మా, వలదు.

కళా:- ఓసీ! మీ రెంతటి పిఱికివారే. నేనుండగా మీకేమి భయము? నన్నుజూచి ధైర్యముతో నొక గడియకాల ముండి, నే జెప్పినట్లు చేయుఁడు. మీకేల నే అధికప్రసంగము?

మంజు:- (స్వగతము) నేడేమో కొంప మునిగె. ఏమైనను కాని, నేనీ పనికి సమ్మతింపను. దేవి చెప్పినట్లు చేయను. (ప్రకాశముగ) చిత్తము దేవి! ఏమి యానతి?

కళా:- ఇదిగో! ఒక రహస్యపు మాట. జాగ్రత్త! ఎవరితో చెప్ప కూడదు. వినుడు. పద్మావతీ దేవిగారి పనికత్తియచే, రహస్యముగా జయదేవులవారి గావంచ యొకటి తెప్పించెద. ఆ చేలము గొంపోయి, దానికి రక్తపు చుక్కలను జేసి త్వరగా కొనిరండు. నేముంగుగా పద్మావతీ దేవిగారి బసకు పోయెద. (మంజువాణి ముఖమును జూచి) ఏమే మంజువాణీ! మోమును ముడివైతువు. శాంతముగా వినుము. నే నామెతో చేరి మాటాడుచుందును. అట్టి సమయమున మీరా పంచెను దెచ్చి మాయెదుట నుంచి "అమ్మా! వన విహార సమయమున జయదేవులవారు వ్యాఘ్రనిహతులైరి. ఇదిగో వారి పంచె" యనుడు. ఇంత చాలును. అటు మీదట నేమి జరుగునో చూచుచుందము.

ప్రేమ:-ఓ దేవుఁడా! నే వినఁజాల. అయ్యో! ఇంతటి మాయ జాలమును బన్న నా చేతగాదమ్మా! ఇదిగో, వలయునేని నాతలఁ దీయుము. సంతసింతును. మన్నింపుమమ్మా! అటు కాదేని, నన్ను నీ కొలువునుండి తొలగింపుము. నాకీ చెలికత్తెపనియే వలదు. నిన్ను ప్రార్థించెదనమ్మా. (ఏడ్చును.)

ప్రేమ:-ఔరా! ఈ యుపాయ మెట్లు తోచినది. దేవీ! నిముసమున నెట్టి జాలమల్లితిరి? అల్లితిరిగాని, యింత తెంపుతో పనిచేయఁగల వారీ నగరమున నెవరుందురు? లేరు-లేరు. నమ్మకుము. ఇది కాని పని.

కళా:-ఏల కాదందువు? ఇందేమి కష్టమున్నది? నోటిమాట కింత కష్టమేమి? మాట మాత్రమునకు వడవడ వడకసాగితిరి. ముహూర్త మాత్రము తెంపుగలిగి నటింపుఁడు. వెనుక నిజమే చెప్పుదము. ఇంతలో నెవరిని హింసించితిమి? ఏమి ప్రమాదము? ఏమి భయము?

మంజు:- అమ్మా! అసత్యమునకన్న భయంకరమగునది బ్రహ్మ సృష్టిలో వేరొకటెఱుంగను. ఆమాట యెత్తిన నాదేహము కంప మెత్తుచున్నది. నిజము జెప్పుటకు నన్నంతరాత్మ కష్ట పెట్టుచుండును. నే నోపఁజాల. (చేతులు పిసికికొనుచు తొట్రు వడును.)

కళా:-ఓసి వెఱ్ఱిదానా! నీవు కలికాలమున పుట్టఁ దగినదానవు కావు. ఏల వడకెదవు? (యోచించి) ఎవరక్కడ? దాసీ! త్వరగా యిటురా.

దాసి:-(ప్రవేశించి) ఏమి సెలవు దేవి—

కళా:-ఇటు రమ్మ (చెవిలో చెప్పి) త్వరగా

దాసి:-ఇదిగో యిప్పుడె (అని నిష్క్రమించును.)

కళా:- సఖులారా? అసత్య మసత్యమని వాపోయెదరు. సత్యా సత్యముల స్వరూపము మీ రెఱుంగుదురా? నేఁజెప్పెద వినుఁడు.

ఆ॥ వె॥ వారిజాక్షులందు వైవాహికములందు
ప్రాణ విత్త మాన భంగములను
చకిత గోకులాగ్రజన్మ రక్షణ మందు
బొంకవచ్చు నఘము బొంద రధిప! ”

అను నీతి బాహాటముగ బోధించుచున్నది. ఇది ధర్మ సూక్ష్మము. ఇందు వారిజాక్షులమగు మనకు నసత్యదోషము కలుగఁజాలదు. చూడుఁ డిది యెఱుంగజాలక స్త్రీలు నస్వతంత్రులై ప్రతిపనికి నూరక జంకుచుందురు. స్త్రీ లేమి తెలివిమాలిన పశువు లనుకొంటివా? స్త్రీలు అబలలనియు, వా రస్వతంత్రులనియు వ్రాసి యుంచినవారు మగవారని యెఱుంగరా?

మంజు:-అయ్యో తల్లీ! ఇది శుక్రనీతి. దీనిని నమ్మరాదని బలిచక్రవర్తి యంతటి విద్వాంసుఁడు, గురువన్న మాటకు నడ్డముఁదిరిగి, "నిరయంబైన నిబద్ధమైన...... తిరుగ న్నేరదు నాదు జిహ్వా" యని

శుకాచార్యునకు బుద్ధిఁజెప్పుట వినమా? ఇంతయేల. వేద మాత, "సత్యం వద, ధర్మంచర" యని బోధించుట వినలేదా?

దాసి:-(ప్రవేశించి) అమ్మా! ఇదిగో (పంచె నిచ్చును.)

కళా:-(తీసికొని) మంచిది. ఇఁక నీవు పొమ్ము.

దాసి:-చిత్తము. (నిష్క్రమించును.)

కళా:-ప్రమదా! మంజువాణీ!

ప్రమ: అమ్మా! అమ్మా! నా ప్రార్థన వినవా?

కళా:-(కోపమున) నోరుమూయుము. మాఱు చెప్పకు. దీనిని పుచ్చుకొనుము. (సఖి పుచ్చుకొనును) మంజువాణీ! నీవును ప్రమదయు వెళ్లి నేజెప్పినట్లు చేయుఁడు. వేగముగా వెళ్లుఁడు. నేనిదే పద్మావతీదేవిగారి బసకు పోయెద. (నిష్క్రమించును.)

మంజు:-ఓ పరమేశ్వరా! కొఱవితో తల గోకుకొన్నట్లు యీమె కేల యిట్లు ప్రేరేపించితివి స్వామీ!

ప్రమ:-ఇది నా మెడంబడినది. ఇఁక చేయక తప్పదు. రావే మంజువాణీ!

మంజు:-ఓసీ! ప్రమదా! ఆకసమునకు నిచ్చెన వేయుచున్నావు. జాగ్రత్త సుమా! కాలుజారిన పండ్లూడుటయేగాక పెద్ద ప్రాణమున కపాయము.

ప్రమ:-ఆకాశమునకు నిచ్చెనయే సరి. నే నెక్కెద ననుకొంటివా? ఆకాశ పుష్ప మపేక్షించువారి కాభయము. నీకేమి—నాకేమి? రావే. ఈ తంత్రమంతయు, మహారాజుగారు శ్రీ జయదేవుల వారు వనమునుండి నింటికి రాకముందే జరుపవలెను.

మంజు:- అయ్యోయో! పద్మావతీదేవిగారు మడుగు గట్టుకొని భర్త రాకకువేచి యాకలిచే నుస్సురు మనుచుండునే. ఇప్పుడే యీ పాపిష్ఠి పరీక్షయా?

ప్రమ:- మఱేమి? ఇదే సమయము. ఈ పన్నుగడ యిపుడే జరుగవలయును. అవల కానిపని. రావే పోదము. మన దేవి పోయినది.

[నిష్క్రమింతురు.]

పద్మావతి మందిరము.

(పద్మావతి మడికట్టుకొని యుండును)

పద్మా:-

తే॥ గీ॥ ఎంత తడవయ్యె వనభూమి కేగి నాథుఁ
డేల యింకను రాఁడయ్యె? చాల బడలి
యుండుగా, భోజనము వేళయును నతిక్రి
మించె; నా చిత్తమేమొ భ్రమింప సాగె
ఏమిది? కారణ మేమైయుండును. (యోచించును)

(ప్రవేశము కళావతి)

కళా:- అమ్మా! నమస్కరించెద. ఏదియో యోచించుచున్నట్లు గన్పట్టు. భోజనమైనదా?

పద్మా:- అమ్మా! రమ్మి. కూర్చుండుము. వన విహారమునకుఁ జనిన నా ప్రాణప్రియుఁ డింతవఱకు రాఁడయ్యె నని యోచించుచుంటిని. మధ్యాహ్నము మీాఱినది. నీకు స్నాన పానములైనవి గదా!

కళా:- భోజన మింకను కాలేదు. మావారును మీా విభుని తోడ వన విహారమునకు వెడలిరి గదా ! వారింకను రారైరి. ఆకలికి డస్సియుందురేమొా యని యోచించి, యేది యుం దోపక మీా దర్శనమునకు వచ్చితిని. వచ్చెడు సమయ మనే తోచుచున్నది. ఇఁక రాఁగలరు. వారిరువురు వేదాంత విచారమున గూర్చున్న లోకమే మఱచిపోదురు.

పద్మా:- ఔను! పరబ్రహ్మ విచారమున గల తీపి యట్టిది.

(ప్రమద - మంజువాణి ప్రవేశింతురు.)

ప్రమ:- నీవు తీసికొని పోవే! (గుడ్డ యియ్యబోవును)

మంజు:- (గుడ్డను తీసికొనక) నీవే కొనిపోవే. నా చేత యీా పని మాత్రము కాదు.

ప్రమ:- దేవిగారు నీతోఁగదా చెప్పినది.

మంజు:- నీకును జెప్పినారు. నేనా యీ యన్యాయమైన పనికి.

ప్రమ:- ఏన నేనా మఱి?

మంజు:- ప్రమదా! మనలో మనమే వివాదపడనేల? ఇరువురిలో నొకరు తీసికొని పోవక? తప్పని సరి. ఇంత దూరమే మోసి కొనివచ్చితివి. దేవిగా రిదిగో, యిచ్చటనే కూర్చున్నారు. ఈ కాస్తదూరము నీవే కొనిపొమ్ము.

ప్రమ:- (స్వగతము) అనిష్టానికి పాత్రుఁ డంగారకుఁడన్నట్లు తుద కీ పని నాపై బడినది. ఓ దేవుఁడా! పొట్టకూటి కని పడిన సేవకు రాలను. వారేమి చెప్పినను చేయక తప్పదు. (ప్రకాశముగ) అమ్మగారికి దండాలు.

మంజు:- దేవి దండాలు. అమ్మగారికి వందన శతములు.

పద్మా:- ఏమి వచ్చితిరి? వన విహారమునకు వెళ్ళిన మావారు వచ్చుచున్నారా? ప్రమదా! చేతులేమి వెనుక పెట్టుకొనియున్నావు?

(ప్రమద - మంజువాణి ఒకరి నొకరు చెప్పుమని సంజ్ఞ.)

కళా:- పలుకరేమిటే? ఏమి యీ వార్త?

మంజు:- చెప్పవే త్వరగా.

ప్రమ:- నీవే చెప్పుము.

మంజు:- నీవే–నీవే-

పద్మా:- ఏమది? ఏమి విశేషము? చెప్పరాదా? ఎవరైన నేమి?

మంజు:- చెప్పుటకు నా నోరాడదు తల్లీ! ఏమని చెప్పను, యీపాడు మాట. (నిట్టూర్పు విడుచును)

పద్మా:- ఏమే అది? అంత చెడ్డమాట యేమిటి? వారందఱును క్షేమమే కదా?

ప్రమ:- (స్వగతము) ఎట్లు చెప్పుదు నబ్బా! భయ మగుచున్నదే. (ప్రకాశముగ) వన విహారమునకు వెళ్ళియున్న శ్రీ జయదే... వు... ...ల... ...వా... ...రు... ...

పద్మా:- కుశలమేగదా? చెప్పవే.

ప్రియ:- కుశల మెక్కడిదమ్మా? పెద్దపులి ...నో...రు

పద్మా:- ఆ! ఏమి? ఏమంటివి? చెప్పవే. వివరముగా చెప్పక నను చిత్రవధ చేసెదవేలనే? ఏమి జరిగినది? త్వరగా చెప్పుము.

ప్రియ:- పెద్దపులినోట బ...డె...న...ట...మ్మా! అయ్యయో!

పద్మా:- హా! ప్రాణేశ్వరా! (క్రింద పడును)

ప్రియ:- పులి కఱచుటచే ప్రాణము పోయెనట. ఇదిగో ఆనవాలు— వారి పై పంచె.

కళా:- (ఏమియు తెలియనట్లు నటించి ఆశ్చర్యమున) అయ్యయో! ఏమి కాలము వచ్చినదే:

పద్మా:- (పంచె దీసికొని) వారిదే యిది. జయదేవా! హా! ప్రాణవల్లభా! (మెడ వాల్చును)

మంజు:- అయ్యో! అయ్యో! పడె పడె. (పట్టుకొందురు)

కళా:- ఏమే ! ఏమే ! (లేచివచ్చి పట్టుకొనుచు) పద్మావతీ ! దేవీ! ఆహా ! అయ్యో (చేతులు పిసికికొనుచు)

ప్రియ:-ఇంకేమి తల్లీ ! చచ్చినది. హరిహరీ! (ముగ్గురు పట్టుకొని క్రింద నుంచెదరు) ఎంత పాపపు పని చేసితివమ్మా. నిండు ప్రాణమే! స్త్రీ హత్యయే! అయ్యో!

మంజు:-ఎంతటి పతివ్రతతల్లీ! ఎంతకాలము వచ్చెనమ్మా! వలదని మొత్తుకొంటిని. నామాట వినకపోతిరి గదా.

కళా:- తెలివి లేకపోయెను. నా కొంపకు నేనే నిప్పంటించితిని. ద్రోహిని—పాపిని — ఇంకేమి సేయుదునమ్మా? ఏనూతిలో పడుదును? ఏ యగ్నిలో దూరుదును? అయ్యో! నా ప్రాణము పోకయున్నది. ఎంతపని గావించితిని. హా! తల్లీ (క్రిందపడును.)

సఖు:-(ఇద్దఱు సమీపించి) అమ్మా—లెమ్మ—ఎంత యేడ్చిన నింకేమి ప్రయోజనము. ఐనదేమో ఐనది. (కూర్చుండబెట్టి) వలదని చిలు

కకుఁ జెప్పినట్లు చెప్పితిమి. మూర్ఖపు పట్టు వదలుమంటిమి. విన నైతిరి. అయ్యో తల్లీ! ఇంతటి శీలవతిని మన మీ జన్మమున నెందు చూడఁగలము. ఇంకెక్కడ సంపాదింప గలము. (లోపల ధ్వని వినపడును.)

ప్రియ:-అదిగో! ప్రభువుగారి రథము వచ్చుచున్నట్లున్నది. ఇఁక మన గతియేమి? వారికేమని చెప్పుదము. కొంప మునిగినదే. ఈపనికై యిఁకెన్ని ప్రాణములు హతముఁ గానున్నవో (నోరు మూసికొందురు.)

కళా:-నా కెంతటి బుద్ధిమాంద్య మయ్యెనే. ఎంత తెలివిలేక పోయెనే. చూచిచూచి ప్రళయాగ్నిలో దుమికితినే? ఇంక నా గతియేమి? అయ్యో! ఏలాగే ప్రియదా? ఏమి చేయుదునే మంజువాణీ!

(సఖు లిద్దఱు కన్నీరు దుడుచుకొనుచుందురు.)

ప్రియ:-అమ్మా! ఏల యేడ్చెదవు? దుఃఖమును మింగుము. రాజు గారు వచ్చుచున్నారు. సద్దు సేయకుడు. తాళుడు (చెవియొగ్గి విందురు.)

మంజు:- ఔను. మన మిప్పుడు చేయవలసిన విధానమును ముందుగనే యోచింతము. రాజుగారు వచ్చి యడిగిన నేమని మనవి చేయ వలయును? వారడుగక ముందే మనవి చేయుట కొంత మేలు. చూడుడు. ఎవరో వచ్చినట్లున్నది. తాళుఁడు; తాళుఁడు. (అందఱు నివ్వెరపడి నిల్తురు.)

కళా:-ఎవ్వరును లేరు. కాని, యిటురండి. పద్మావతీ దేవిగారు పాము కఱచియో, తేలుకుట్టియో ఆకస్మికముగ చనిపోయి రందమా?

మంజు:-సరే!—— సరే. ఒకటికి —— రెండా! జయదేవులవారేమి సామాన్యపు వ్యక్తి యనుకొంటిరా? దివ్యదృష్టి గలవారు. సర్వజ్ఞులు. అంతయు అరచేతిలోని ఆమలకమువలె, నిముసమున

కనిపెట్టగలను. వెనుక నేమగును? అయ్యయో! అట్లు చెప్పఁ గూడకను.

కళా:-మఱి యేమని చెప్పుదము.

మంజు:-యథార్థమే చెప్పవలెను. ఏమైననుకానీ—ఎందరి ప్రాణము లైనను పోని.

ప్రేమ:-నాకును అంతే తోచుచున్నది.

కళా:-కానిండు. నేనిందే యుందును. మీరు వెళ్లి రాజుగారితోను జయదేవులవారితోను తిన్నగ మనవిచేసి రండు. తరువాత నీశ్వరుఁడే గతి. వారి చిత్తము, నా యదృష్టము.

మంజు:-సరేనమ్మా. రావే పోదము ప్రేమదా! జాగు కారాదు. రా రమ్మా. (నిష్క్రమణము.)

(ప్రవేశము:—రాజు, జయదేవుఁడు, భటులు, మంత్రి, సఖులు.)

రాజు:-ఎక్కడ? ఎక్కడ?

ప్రేమ:-దేవా! చిత్తగించుఁడు. (చేతులు పిసికికొనుచు) భగవానుఁడా నీవే గతి.

రాజు: (జిచ్చపడి చూచును.)

జయ:-పుణ్యాత్ములారా! మా పద్మావతి యెందున్నది? చూపుఁడు.

మంజు:-ఇదిగో స్వామీ!

తే॥ గీ॥ నిదురఁ బోయెడు తెఱఁగున, నేలపైన
వ్రాలియున్నది యిదె —

జయ:- ఆహా! పావనాంగి,
నాదు ప్రాణమయో ప్రాణ నాయకీ! స
తీమణీ! నన్ను బాసితే తెంపు చేసి. (తల తొడపై నిడుకొని.)

మ॥ కలనైనం నినుబాసి నిల్వగలనే కాంతామణీ! ప్రేయసీ!
పొలతీ! యిట్టి విపత్సముద్రమున నన్ముంచంగ నీ కొప్పునే?
లలనా! నాదెసఁ జూచి పల్క విదియేలా మానినీ! కోమలీ!
కలకాలంబును కష్టమే పడితివే? కట్టా! ననుం గూడుటన్.

అయయెూ, మోహనాంగీ!

సీ॥ కనులకుఁ జీకటిగా దోఁచె లోకంబు
మాటలేవియు విన సూటిగావు
నాస, యేవాసన నాస సేయదు; నాల్క
కే వస్తువేనియు హితవు గాదు
మాప్రిస్పడి మేను స్పర్శము నేమియు నెఱుంగ
దాకలి దప్పి శూన్యంబులయ్యె
కాలు సేతులు నాడఁ జాలవు నాదు మా
నసము కషాయత నష్టమయ్యె

ఆ॥ వె॥ మాటరాదు నోట; మతిచెడె నింకేమి
జీవితాశ నాకు దేవి! నాదు
ప్రాణమీవె గాన నదియు నీ వెంటనే
వచ్చె నిదిగో నిన్ను బాయలేక

జయ:-ఆహా! శ్రీహరీ (మూర్ఛ)

రాజు:-అయ్యో! ఏమి యీ యకాల ప్రళయము. దైవమా! (జయదేవుని లేపి) స్వామీ! దేశిక సార్వభౌమా! మహానుభావా! (అనుకొని కూర్చుండి) నా మనవి యొక్కటి దయచేసి వినఁదగు. ఈ యనర్థముల కెల్లను గారణ మీదౌర్భాగ్యురాలే (భార్యను జూపి) ఇంతటి పరమపాపి—యిట్టి ఘోర రక్కసి—యే లోకమునను బుట్టి యుండదు స్వామీ! కాన దీని నిప్పుడే వధించి—

జయ:- హరిహరీ! వలదు—వలదయ్యా!

రాజు:- దయయుంచి సెలవిండు. దీనిని హతమార్చి యీ యపరాధమును బాపెద. (లేచి, ఒఱనుండి కత్తిఁ దీసి)

కళా:- చిత్తము నాథా! నే నింతకే గాదు-ఇంతకన్న నెక్కువ శిక్ష యేదియున్నను దానికిం దగియుందును. నే నభాగ్యురాలను. నిజముగా క్రూర రాక్షసిని. శ్రీ గురుపత్నిని నిముసమునఁ గోలు

పోయితిని. అపరాధిని. శతాపరాధిని. నను జంపివేయుము

(కాళ్లమీద పడును)

జయ:- ఆ! ఆ! ఆగు మాగుము. స్త్రీవధ వలదు. వలదు. నిలువుము.

రాజు:- (ఆగి, యోచించి, నిట్టూర్పువిడిచి) ఇన్నిటికి మూలము నేను

కం॥ నేనుగదా మాతల్లిని,
మానవతిని బిల్వబంచి, మాలఁడు కపిలున్
జానఆకు భంగిఁ జంపితి,
నానా నే వధ్యుఁడను సుమా పాపమతిన్

తే॥ గీ॥ ఇట్టి పాపాత్ముఁ డుండనా నే ధరిత్రి,
విడువుఁ డీ మండలాగ్రింబు చేత నాదు,
శిరము ఖండించుకొని భూమి భరముఁదీర్తు
వదలుఁడో దేశికేంద్ర!మీ పదములాన (నమస్కరించును)

కళా:- (చేయి పట్టుకొని) వలదు వలదు. నాథా! ద్రోహిని నేను.
పాపాత్మురాలను నేను. ప్రాణేశ్వరా! మీరు కాదు-కాదు.

కం॥ నే వధ్యురాల నాథా—

రాజు:- చీ, వదలుము చేయి
మారు వల్కకు నాకున్

జయ:- భూవర క్రోధం బేటికి,
మీావలనను దప్పులేదు మేలగు మీాకున్.

రాజు:-అదెట్లు మహాస్వామీ! నాచిత్త మెంతయు తహతహ నొందు
చున్నది. ఏమియుం దెలియక యున్నది. మూఢ హృదయుఁడ
నైన నాగతి యేమి? సెలవిచ్చి పాలింపుఁడు

కళా:- స్వామీ! నేనీ పాప సముద్రమును దాటుటెట్లు? ఈ సాధ్వీ
మతల్లి బ్రతుకుటెట్లు మా యందరి హృదయాంబుజములు
వికసించుటెట్లు? (పాదముల బడుదురు)

జయ:- పరమేశ్వరుడు, మీాకే కీడును రాకుండ కాపాడును గాక
లెండు. (కళావతి-రాజు లేచి నిలుతురు)

జయః- భక్తార్తి నివారకా! పరమేశ్వరా!

సీ॥ అఘదైత్యు కడుపున నణగిన గోప బా
లురఁదేల్చినట్టి నేర్పరి యెవండు
యమపురిఁ జేరినయట్టి సాందీపుని
పుత్రునిఁ దెచ్చిన పూజ్యుఁ డెవఁడు
వరుణు పాశంబులఁ బడిన నందుని పున
ర్జీవితు జేసిన దేవుఁ డెవఁడు
కార్చిచ్చు దరికొన్న కడుభీతులైన గో
పకులను గాచిన భవ్యుఁ డెవ్వఁ

తే॥ గీ॥ డట్టి నరకాంతకుఁడు కాళియాహి భేది,
కంస దమనుండు భక్త సంకటహరుండు
పతితపావనుఁ డిందిరా ప్రాణనాథుఁ
డైన శ్రీకృష్ణమూర్తి మా యార్తిఁ బాపు

శా॥ శ్రీకృష్ణా జగదీశ్వరా! కలుషహారీ! ద్రౌపదీ సోదరా!
శ్రీ కాంతా హృదయేశ్వరా! మము దయాదృష్టిన్ విలోకింపవే
యీకాంతామణి ప్రాణమీయఁగదవే యీ యార్తిఁ బాపంగదే
మాకున్ లేరిక దిక్కునిశ్చయము ముమ్మారు న్నిజంబో హరీ!

తే॥ గీ॥ నిత్య సత్యవ్రతంబున నిల్తునేని
వనిత పద్మావతియు పతివ్రతయె యేని
మాకు నన్యోన్య మైత్రి సమ్భవమె యేని
మానినీమణి యసువుల నూనుఁ గాత!

పద్మా:- (వెంటనే లేచి) నమో నమః. ప్రాణేశ్వరా! (నాథుని పాదములఁ ప్రణమిల్లును)

జయః- కల్యాణీ! నీ కాపదలు దూరమైనవి గాక! (భార్యను పైకెత్తి కౌగలించును) (పుష్ప వర్షము కురియును)

(అశరీరవాక్కు) జయదేవ - జయదేవ - జయదేవ - దేవా! జయ
పద్మావతీ పతే - జయ - జయ - జయ.

పద్మా:- నాథా ! నాకెంత చెడ్డకల వచ్చినది. దాని కీడు తమకు దూరమగుఁ గాక!

రాజు:- తల్లీ? నమస్కారము.

కళా:- సాధ్వీమతల్లీ! వందనములు.

జయ:- అది యేమికల కల్యాణీ!

పద్మా:- స్వామీ! దానిని స్మరించిన భయమగుచున్నది. తమఃని వ్యాఘ్రము మ్రింగినట్లు.

కళా:- మాతా! అదికలగాదు. తమ పాతివ్రత్య మహిమను శోధింప నెంచి, యీ పాపాత్మురాలు చేసిన కృత్రిమ వ్యాపారము. కాన నన్ను మన్నించి తమ కృపాదృష్టి నెఱపి, యీ దీనురాలిని రక్షింపవలయును.

పద్మా:- దేవీ! కళావతీ! భయపడకుము. మా వలన నెవ్వరికిఁ గీడు కలుగకుండు గాత! మీకు నిరంతర మంగళం బొదవుఁ గాక! లెమ్ము. లెమ్ము.

సఖు:- తల్లీ! మే మసత్యమును చెప్పి మిమ్ము కష్టపెట్టిన ఘోర పాపులము. అనుగ్రహింపవలెను.

పద్మా:- మీకు సర్వదా క్షేమమే గలుగు గాక!

భటుఁడు:- (ప్రవేశించి) మహాప్రభూ! ఎవరో మధువనవాసుఁడట. పేరు ధనగుప్తుఁడట. తమ యాజ్ఞకై ద్వారమున వేచి యున్నాఁడు.

జయ:- ఓహో! ధనగుప్తుఁడా? అవశ్యముగా పిలుచుకొని రమ్ము

భటు:- చిత్తము. (వెళ్ళి, గుప్తునితో మరల ప్రవేశించును)

ధన:- స్వామీ! దేశిక సార్వభౌమా! ఏమి నా భాగ్యము! తమ పాదాబ్జములకు నమస్కరించెద.

జయ:- ఆహా! ఎంత కాలమునకు నిన్ను జూడగలిగితిని. మీకెల్ల రకు సేమమా నాయనా?

ధన:- దేవరవారి యనుగ్రహ భాగ్యమున సేమమే. తమ కుశల వార్త, యిన్ని దినములకు మధుసూదన భట్టారకుని చే విని, తమ దర్శనమునకై రాత్రింబవళ్లు నడచి నడచి, నేటి కిందు జేరితిని. దేవా! ఇపుడుగదా నా ప్రాణములు స్థిరస్థాయి నొందినవి. స్వామీ! అజ్ఞానముచేత నా వలన తమకైన విపత్పరంపర నా కరిష్టము రానీక పూర్ణానుగ్రహమున జూడవలయు. (పాద ములమీద పడును)

జయ:- భయపడకుము. నీకేలాటి బాధయు కలుగదు. నీవేలాటి తప్పిదముం జేయలేదు. నీకు శ్రేయోలాభమగును. లెమ్ము.

ధన:- (లేచును)

రాజు:- ఓరీ సేవకా! మా తల్లిగారు పునర్జీవితురాలైరి. మే మంద దరమును మఱల పుట్టినట్లైనది. నేడు మిక్కిలి సుదినము. ఇదిగో! నగరమెల్ల నలంకారము చేసి విభవముతో మే మంద ఱము గొలుచుచుండ వీరిరువురకును గజేంద్రముపై నుత్సవము సేయింప నా యాజ్ఞయైనదని ముందుగా జాంఘికునకు జెప్పి వీటఁ జాటింపఁ బంపుము. పొమ్ము త్వరగా.

భటు:- చిత్త మిదిగో పరువిడి వెళ్ళుచున్నాను. (పరుగెత్తుచు నిష్క్రమించును)

జయ:- మఱి! ఇఁకేల యాలస్యము. భోజనమునకు ప్రొద్దయినది.

రాజు:- మా యందఱికిని సెలవా? ధనదుగుప్తా! నీవు మాకు సహోదరుఁడవు. మాకీ సంతోష సమయమున విందైతివి. భోజనానంత రము మన మందఱము, మరల స్వాములవారి సన్నిధికి వత్తము. రమ్ము పోవుదము.

ధన:- మంచిది. తమ చిత్తానుసారమే. (జయదేవునితో) స్వామీ! మా యందఱికి భోజనమునకు సెలవా?

జయ:- పోయిరండు. పాపము ధనదుగుప్తుడు దారి నడచి నడచి మిగుల నలసియున్నాడు.

ధన:- దేవరవారి దర్శనమున నా యలసట తీరినది. ఇప్పుడే భుజించి నట్లున్నది. దేహమునకు జవసత్త్వములు వచ్చినవి.

[అందఱు నిష్క్రమింతురు]

## విష్కంభము

(సూత్రధారుడు ప్రవేశించి)

ద్విపద: (పాటకీలి)

జనులార! వింటిరే జయదేవు చరిత,
కనులార గంటిరిగా నాటకంబు 1.

మఱువగా రాని ధర్మము లిందుఁగలవు,
గుఱు తెఱింగించెదఁ గూర్మితో వినుడు 2.

జయదేవుఁ డెట్టి కష్టము లెట్టులోర్చె,
దయలేని తనదు శాత్రవుల రక్షించె 3.

స్థిరమగు సమాధి శాంతిని బొందియుండి,
కరుణ శిష్యులకు నిక్కపు త్రోవఁజూపె 4.

తలి దండ్రులకు భక్తి, తరుణికి రక్తి,
ఖలులకుఁ గూడ నస్ఖలిత మృదూక్తి 5.

శరణన్న వారి కారుణమున ముక్తి,
ధరఁగల భూతసంతతి కనురక్తి 6.

వెలయించుచుండె నోపికఁ బుణ్యమూర్తి,
ఇల నట్టి మగవారలెల్ల నుండుండు 7.

తెఱవలు పద్మావతీదేవి యట్లు
తఱుగని భక్తి భర్తలకు జేయుండు 8.

తలిదండ్రు లాయమ తలిదండ్రులట్లు,
లలిత వర్తన బిడ్డలను జూచుకొనుఁడు 9.

ధనదుగుప్తునిని సుదర్శను సాటి,
గొనవలె శిష్యులు గురువుల యెడల 10.

త్యాగంబు తనకెంత యల్పమై యున్న,
భోగ నాగులయట్లు పోరాదు భటులు; 11.
వలదు కళావతివలె దుర్ణయంబు
సలుప పతివ్రతాజన రత్నములకు 12.
నెచ్చెలుల్ మంజువాణిని బోలవలయు,
మ్రుచ్చైన ప్రమదను బోలంగ రాదు 13.
ఇది యిందు బాహ్యార్థ మింక నంతరార్థ
మదియు సూచించెద, నార్యులు వినుఁడు 14.
యజ్ఞదేవుండన, నగు కర్మఠుండు,
ప్రాజ్ఞతఁ జూడ సువ్రత యగు తపము 15.
జయదేవుఁ డనగ నీశ్వరుఁడగు, నతని
దయిత పద్మావతి, తరుణియె మాయ 16.
ధనదుగుప్తుఁడు జీవతత్త్వమౌ, నతని
ధనమె సంచిత కర్మతతి, వాని భటులు 17.
భోగదా సతని తమ్ముఁడు నాగదాసు,
సాగు కామ క్రోధ శతవృత్తు లగుచు 18.
సుమతి ప్రజ్ఞయు, బావి చూడ దేహంబ,
శమనిధియౌ సుదర్శనుఁ డాత్మవేత్త 19.
యతని మంత్రి వివేకమగు, ప్రభాసుండె
ప్రతిభ, కళావతీ రమణియు విద్య 20.
ప్రమద గర్వము, మంజువాణి సత్యంబు,
విమలమౌ నహమె త్రివిక్రముఁ డనఁగ 21.
మధువనపుర మనంబదు విషయాళి,
మధుసూదనుండు సన్మతి నిగ్రహంబు 22.
బండి చిత్తము, సువ్యవస్థ యోగంబు;
దండిగా నిట్టి యర్థము లిందుఁ గలవు 23.
పామరులకుఁ జాలు బాహ్యార్థ మిందు,
ధీమంతు లెఱుగుఁడీ దీని మర్మంబు; 24.

ఎఱిఁగిన వారెల్ల నెఱుఁగని వారి
కెఱిఁగింపుఁ డెఱిఁగి వారిత్రోవఁ బట్టి 25.
ధన్యత్వానట్లిది ధర్మముసుండీ,
పుణ్యావర్తనులార! బుధ జనులార 26.

(నిష్క్రమించును)



5 వ అంకము. 4 వ రంగము.

జ య దే వు ని గృ హ ము

(ప్రవేశము జయదేవుఁడు: పద్మావతి తాంబూల మిచ్చుచుండును)

జయ:- ధనగుప్తుఁ డేమిచేసె? పాపము. వాఁడు మనకు మిగుల భక్తుఁడు. పరమసాధువు. సదయ హృదయుఁడు.

పద్మా:- (చిఱునగవున) ఐన మరల మధువనమున కొకతూరి వెళ్ళివచ్చెదరా?

జయ:- (నవ్వి) ఔనౌను. నిజముగా వెళ్ళవలసియే యున్నది.

పద్మా:- అదేల నాథా!

జయ:- నిన్నటి దినమున ధనగుప్తుఁడు మాటాడునప్పు డతఁడు మా తలిదండ్రుల నెమకించి, రావించి, యూరడించి, మధు వనమున నిలిపియున్నానని చెప్పె. వారు వృద్ధులగుటచే తన వెంట రాజాలరైరట! మనల దోడ్కొని వత్తునని వారితో నమ్మబలికి, యిటు వచ్చినాడట. మనకై వా రెదురుచూచి కృశించి, యన్న పానాదుల నాసింపకయుందురు గాన——

పద్మా:- తమ యోచన మంచిదే కాని, కళావతి నాతో చెప్పినది చూడగా మన కిందే నివాసము చేయింప సుదర్శను నుద్దేశ మైనట్లు నాకుం దోచెడిని.

జయ:- (నవ్వుచు) ఓహో! కళావతీదేవి, మరల నిన్నొక్క వ్యాజమును కల్పించి పరీక్షింతమని కాదు గదా?

పద్మా:- కాదుకాదు (నవ్వి) ఆనాడు మొదలామెకు నాపై నమిత భక్తి ప్రపత్తి పొడసూపినది. ఇదిగో! తలఁచుచున్నట్లే సుదర్శ నాదులు మీా సుదర్శనమున కేతెంచుచున్నారు.

(ప్రవేశము: రాజు, కళావతి, ధనదుగుప్తుఁడు, సఖులు, భటుఁడు)

రాజు:- దేశికోత్తములకు వందనములు.

ధన:- గురు సార్వభౌమా! స్వామీా! నమస్కారము.

జయ:- మీాకు చిరతరానంద ప్రాప్తి కలుగుగాక!

కళా:- (పద్మావతితో) వీర పతివ్రతా మతల్లిగారికి శరణు.

పద్మా:- సుమంగలీభవ!

ధన:- (జయదేవునితో) స్వామీా! తమతో దాసుఁడు మనవిచేసిన విషయము.——

జయ:- ఔనయ్యా! చెప్పుమఱచితి. ఇందును గూర్చియే యింతవరకు తలపోయుచుంటిమి. (సుదర్శనునితో) రాజేంద్రా! మే మిచ్చటికి వచ్చి దాదాపొక సంవత్సర మతిక్రమించినది. మా తలి దండ్రులో——మిగుల వృద్ధులు. మధువనమున మారాక కెదురు చూచుచున్నారు. నేడు మేము ప్రయాణము చేయఁదలచి——

రాజు:- హా! హా! మమ్ము విడిచి—దేవా! ఎంతమాట? ఈ రాజ్య సర్వస్వమును తమది. మే మందఱము తమ సేవకులము. మా యెడ తమకు నిజముగా పుత్ర వాత్సల్యము కలదేని, తా మిందే సుఖముగా నివసించి, మాకు తామనవరత సేవామృత మనుగ్రహింపవలయు. ఇదే ప్రార్థన. దాసుని మనవి నంగీకరింప వేఁడెద.

ధన:- ఓహో! రాజేంద్రా! మా స్వామివారి సన్నిధి మాకు కఱ వగునట్లు చేయఁదలఁచినారే మాకేమిగతి?

రాజు:- ప్రియ సోదరా! నీ వట్లెప్పటికిని దలంపకుము. నీవు వెళ్లి, శ్రీ స్వాములవారి యొక్కయు, శ్రీమతి అమ్మగారి యొక్కయు తలిదండ్రుల, నిచటికి వేగముగా పంపించుము. వారందరిందే సుఖముగా నుండగలరు. ఇంక నీవేవిఘ్నమును

చేయకుము. వలయునేని, గురుస్వాముల దర్శనము నీవు సులభముగా చేసికొనగలవు. (పద్మావతితో) తల్లీ! నా మనవి చిత్తగింపవలయు.

పద్మా:- (జయదేవుని జూచి నవ్వును)

జయ:- అయ్యా! మంచిది. నీ యిచ్ఛ మేర కటులనే చేయుదము.

రాజు:- (నవ్వుచు) దేవా! తామిట్లనుగ్రహించుటచే నే ధన్యుఁడ నైతిని. నా రాజ్యము సంపూజ్యమైనది. దేహ గేహములు పరమపావనములైనవి. ఈ సర్వైశ్వర్యములు సఫలములైనవి. మన మందఱము నిరంతరాయముగ సుఖ పరంపరలఁ బొందుచుందము.

జయ:- మంచి దట్లే కానిమ్ము.

చం॥ సకల విపత్పరంపరల చయ్యనఁదీర్చి, సుఖంబొసంగి పా
యక మము బ్రోచుచుండెడు సుధాంబుధి శాయి సమస్తలోక నా
యకుఁడు దయాంబు రాశి మన కందఱకున్ శరణంబు; గాన త
త్ప్రకట చరిత్రి మెల్లపుడు పాడుచునుందము రండు లెండికన్.

(అందఱు లేతురు)

మంగళ మహావృత్తము

జయ:- భక్తజన హృత్కమల, బంబర సకృత్స్మరణ ।
భర్జిత భవ ప్రకర బీజా ॥

పద్మా:- శక్తిశివ యుక్తికృత, సర్వజగదండ భవ ।
సంభరణ సంహనన లీలా ॥

రాజు:- యుక్తిశత వాక్తతి వియుక్త నిజరూప గగ
నోపమ విశుద్ధమతి గమ్యా ॥

ధన:- భుక్తి, గురుభక్తి, భవముక్తి ననురక్తి నిడి ।
భూప్రజలఁ బ్రోవఁగదె దేవా ॥

## మా గ్రంథమాలకు ధన మొసంగిన, వుదారచరిత్రుల పేర్లు.

### రా జ పో ష కు లు.

శ్రీమాన్ మహానాయకాచార్యులైన పులిచర్లపాళ్యం, జమీందారు, పి. వెంకటచంద్రప్ప నాయునివారు. కామవరం కొత్తపేట.

శ్రీమాన్ నాయకాచార్యులైన శ్రీ॥ యం బి. శేషాచలపతిరాజా, జమీన్‌దారుగారు, బంగారుపాళ్యం.

శ్రీ ఎ. చిదంబరరెడ్డిగారు, పెడబల్లి

శ్రీ పాటీల్, ఓబిరెడ్డిగారు, గ్రామ మేజస్ట్రేటు, చిగిచెర్ల.

,, పాటీల్, రామిరెడ్డిగారు, మొరవపల్లి అగ్రహారము.

,, అక్కి పెద్ది రామశేషయ్యగారు ధర్మవరం.

,, గ్రంథే రామస్వామి శాస్త్రిగారు, జమ్మలమడుగు.

,, ఏ. క్రిష్ణప్ప అండు సన్స్ గారు, కడప.

,, పి. బయ్యపరెడ్డిగారు (భూస్వామి) పాముదుర్తి.

### అ భి మా ను లు.

శ్రీ టి. రామానుజులు నాయుడుగారు, డిస్ట్రిక్ట్ కలెక్టర్ జమ్మలమడుగు.

,, కట్టా వెంకటయ్యగారి శ్రీనివాసయ్యగారు, (ఫార్మెన్) హిందూపురం.

,, కొప్పరపు సుబ్బయ్య శాస్త్రిగారు, ప్రొద్దుటూరు.

,, సోమిసెట్టి కొండయ్య, జూటూరు నాగయ్యగారు, ,,

,, వి. రాజారెడ్డి గారు, వల్లెవీడు—చిత్తూరు జిల్లా.

,, శ్రీకంఠం సుబ్బయ్యగారు, అనంతపురం.

,, పాకం యరిప్ప బ్రదర్స్ (జిన్ ఫ్యాక్టరీ) ఉరవకొండ.

,, యం. నరసింహులు నాయుడుగారు, సర్కిల్ ఇన్‌స్పెక్టర్ పులివెందల.

### స హా య కు లు.

శ్రీ వై. వి. అశ్వత్థనారాయణరావు గారు, పోష్టల్ డిపార్టమెంటు, హిందూపురం.

,, ఆర్. రాజారావుగారు, (వకీల్) ,,

,, బైసాని అణ్ణయ్య కొమారుడు సరార్య నారాయణయ్యగారు ,,

,, బి. యన్. శర్మాగారు, గోరంట్ల.

,, టి. శిద్దరామప్పగారు (డిస్ట్రిక్టుబోర్డు మెంబరు) ,,

,, యన్. శంకరనారాయణ గుప్తగారు, పంచాయితీ బోర్డు ప్రెశిడెంటు, [పాలసముద్రం.

,, కలవల వెంకటనారప్ప శాస్త్రిగారు (జవులీఅంగడి) ధర్మవరం.

శ్రీ కలవల పెద్ద నారాయణప్ప శెట్టిగారు, (సిల్కు మర్చెంట్) ధర్మవరం.
,, కాకిమాని చిన్న వెంకటస్వామి శెట్టిగారు (బెల్లంమండీ) ,,
,, అవారి వెంకటరమణప్పగారు (రేషం జవుళివ్యాపారం) ,,
,, జగ్గా లక్ష్మయ్య సన్స (కిరసనాయిల్ డిపో) ,,
,, పిన్నా బలరామయ్య శెట్టిగారు ,,
,, సత్రసాల వెంకట నారాయణప్ప శెట్టిగారు పం. బో. ప్రెసిడెంటు [ధర్మవరం.
,, కలవల చిన్న గురప్ప శెట్టి అండు సన్స (సరాబుఅంగడి) ,,
,, పుట్లూరు సుబ్బయ్య శెట్టిగారు, సరాబుఅంగడి, ,,
,, జి. లింగారెడ్డిగారు. [భూస్వామి] మాల్యవంతం.
,, యం. చిన్న వెంకటపతిగారు [భూస్వామి] నిడిగల్లు.
,, యస్. బి. కేశవయ్యగారు [సబ్ రిజిస్ట్రారు] పెనుగొండ.
,, బి. అప్పసామిగారు [తహశీల్ దార్] కల్యాణదుర్గం.
,, జయం. సుబ్బరామేశ్వరప్ప–రంగ నారప్పగార్లు ,,
,, సి. వి. నారాయణగారు, బి. ఏ. యల్. టి. ,,
,, పర్వతరాజు సూర్యనారాయణరావు గారు [బోర్డు హైస్కూల్ హెడ్‌మాస్టర్] ,,
,, రాచమడుగు వెంకటప్ప శెట్టిగారు ఆత్మకూరు–అనంతపురం జిల్లా.
,, ముంగర రామచంద్రరావుగారు హెడ్మాస్టర్, బోర్డుస్కూల్, అనంతపురం.
,, కె. వి. వేమారెడ్డిగారు, అడ్వొకేట్, ,,
,, ఎ కొండప్పగారు, వకీలు ,,
,, వైడి. లక్ష్మయ్యగారు, అడ్వొకేట్ ,,
,, మానేపల్లి నారాయణరావుగారు అడ్వొకేట్ ,,
,, జి. వెంకటరెడ్డి గారు అడ్వొకేట్ ,,
,, తుమ్మలశెట్టి సుబ్బయ్యగారు ,,
,, కట్టా సుబ్బయ్య శెట్టిగారు, సరాబుఅంగడి ,,
,, ఎ. నారాయణప్పగారు [సౌత్ ఇండియా కో–ఆపరేటివు ఇన్ష్యూరెన్సు సొసైటీ బ్రాంచ్ మేనేజర్] ,,
,, యం. హంపయ్య, అండు సన్స [జిన్నింగ్ ఫ్యాక్టరీ] గుంతకల్లు.
,, కుంచం వెంకటాచలం శెట్టిగారు బళ్లారి.
,, వన్నప్ప శెట్టిగారు ఉరవకొండ.
,, యం. కరెప్ప అండ్ సన్స ఉరవకొండ.
,, పాటీల్ నాగిరెడ్డిగారు, గ్రామ మేజస్ట్రేటు పెద్దకోట్ల.
,, పాటీల్, నారాయణరెడ్డిగారు, గ్రామ మేజస్ట్రేటు చిన్నకోట్ల.
,, నాగిరెడ్డిగారు ,,
,, కే.సి. నారాయణప్ప, యజ్, రంగప్పగార్లు జవుళీవ్యాపారం జమ్మలమడుగు

| | |
|---|---|
| శ్రీ పండ్ల శేషయ్యగారు | జమ్మలమడుగు. |
| ,, భూపాళెం వెంకట సుబ్బయ్యగారు | ,, |
| ,, చెన్నంశెట్టి నారాయణప్పగారు | ,, |
| ,, తాతిరెడ్డి నరసారెడ్డిగారు | ,, |
| ,, గోపు కొండారెడ్డిగారు | గుండ్లకుంట. |
| ,, గాడిచర్ల మధ్వమునిగారు | ప్రొద్దుటూరు. |
| ,, డి. క్రిష్ణరావుగారు బి. ఏ., బి. యల్. వకీలు | ,, |
| ,, ఓగేటి బాలయ్య, శేషయ్యగార్లు | తాడిపత్రి. |
| ,, పామిడి సుబ్బన్నగారు | ,, |
| ,, బచ్చు రాఘవయ్యగారు | కమలాపురం. |
| ,, బచ్చు వెంకటసుబ్బయ్యగారు | కడప. |
| ,, ఏచూరు వెంకటసుబ్బయ్యగారు | ,, |
| ,, వీరబోయన కొండయ్య, వెంకటేశంగార్లు | ,, |
| ,, భవనాశి నారాయణస్వామి శెట్టి సన్సు సుబ్బరాయశెట్టి గార్లు | ,, |
| ,, షేకు దావూద్ సాహేబుగారు, ఆంధ్ర పండితుడు | ,, |
| ,, శ్రీమతి అమ్మాయమ్మగారు [ఆశ్రమవాసి] | ,, |
| ,, వి. ఆర్. సత్యనారాయణగారు | రాజంపేట. |
| ,, బొగ్గరపు సుబ్బయ్యగారి వెంకట సుబ్బయ్య గారు | ,, |
| ,, యన్. వెంకటేశయ్యగారు, టీచర్ | ,, |
| ,, డి. కృష్ణరావుగారు [సబ్ మేజస్ట్రీటు] | ,, |
| ,, యల్. గోవిందరెడ్డిగారు, పోలీస్ సర్కిల్ ఇన్స్పెక్టర్, | ,, |
| ,, గుత్తా వెంకటరామానాయుడుగారు | ,, |
| ,, సోమిశెట్టి వెంకటసుబ్బయ్యగారు | ,, |
| ,, కాసల వెంకటస్వామి, ఆచార్య చిన్న రంగయ్యగార్లు | పుల్లంపేట. |
| ,, గాధంశెట్టి శేషయ్యగారు | కోడూరు. |
| ,, చిట్టూరు, వెంకట సుబ్బయ్యగారు | ,, |
| ,, చిల్లా గురువిరెడ్డిగారు [భూస్వామి] | ,, |
| ,, ఆర్. శేషగిరిరావుగారు, Acకేటు | మదనపల్లి |
| ,, చింతల రఘునాథరెడ్డిగారు | వాయిల్పాడు. |
| ,, మాచిరెడ్డి వెంకటస్వామిరెడ్డిగారు [భూస్వామి] | నాగిరెడ్డిపల్లి కదిరి తా॥ |
| ,, ఇట్టా వెంకటరామయ్య శెట్టిగారు | కదిరి. |
| ,, డి. పి. వెంకటనారాయణరెడ్డిగారు [భూస్వామి] | ఇందుకూరు. |
| ,, ఎ. నారాయణరాజుగారు | ముదిగుబ్బ. |
| ,, ఏ. చౌడరాజుగారు | ,, |
| ,, జె. వి. వర్మగారు ఏ. యన్. యం. | పుబ్బళ్లి. |